శ్రీ

# పద్యవ్యూహము

గ్రంథకర్త,

జొన్నలగడ్డ మృత్యుంజయశర్మ.



ప్రకాశకులు.

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు

సంస్కృతాంధ్రబుక్కుడిపో,

రాజమండ్రి.

1926.



[వెల రు]

శ్రీ

# పద్మవ్యూహము.

ద్రోణపర్వాంశము.

[ఆంధ్రకవులనాటకము.

జొన్నలగడ్డ మృత్యుంజయశర్మ
విరచితము.

ప్రకాశకులు
కాళహస్త్రి తమ్మారావు అండు సన్సు
సంస్కృతాంధ్రపుస్తకడిపో
రాజమండ్రి.

శ్రీ చింతామణిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడెను.
రాజమహేంద్రవరము.
1926



వెల 1—0—0.

# ప్రకటన.

| | | |
|---|---|---|
| మహాకవి కాళిదాసు చరిత్రము. | 1 | 4 |
| తెనాలి రామలింగని చరిత్ర. అద్భుతము. | 1 | 0 |
| శ్రీనాథుని చరిత్రము హాస్యము. | 1 | 0 |
| తారాశశాంకవిజయము. శృంగారము | 1 | 0 |
| పారిజాతాపహరణము. | 0 | 12 |
| విజయవిలాసము. | 0 | 12 |
| బిల్హణీయము. | 0 | 8 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము. | 1 | 0 |
| రాజశ్రీ వరవిలాసము. | 1 | 0 |
| మొల్ల రామాయణము. | 0 | 12 |
| సటీక మనుచరిత్రము, | 1 | 0 |
| శాకుంతల నాటకము. | 1 | 4 |
| పార్వతీ పరిణయము. | 0 | 12 |
| కళా పూర్ణోదయము. | 1 | 4 |
| భాదో పరిణయము. | 2 | 8 |
| శివ పురాణము. | 1 | 8 |
| బసవ పురాణము, వచనము. | 2 | 8 |
| భారతము, పద్యకావ్యము. | 0 | 12 |
| భాగవతము. | 4 | 8 |

ఇంకా అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు మావద్ద దొరకును.

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు, బుక్ సెల్లర్స్ రాజమండ్రి.

# ఇందు వచ్చు పాత్రము.

---:o:---

**పురుషులు.**

1. అభిమన్యుడు
2. దుశ్శాసనుడు
3. భీష్ముడు
4. కర్ణుడు
5. వైశంపాయనుడు
6. యుయుత్సుడు
7 సుమిత్రుడు
8. ఘటోత్కచుడు
9. భీముడు
10. అర్జునుడు
11. ధర్మజుడు
12. అశ్వత్థామ
13. ద్రోణుడు
14. కృపుడు
15. శకుని
16. దుర్యోధనుడు
17. కృష్ణుడు
18. సంజయుడు
19. సైంధవుడు

**స్త్రీలు.**

1. ద్రౌపది
2. ఉత్తర
3. సుభద్ర

N. B. సర్వస్వామ్య సంకలితముని ప్రకాశకులవి.

## నాంది

చం. కమలగవ స్తువుల్ గొనగ కైరవకాంతి విధోద్భవంబుపల్
భ్రమరతతుల్ సుధారసను బానము జేయ వృథాప్రయత్నతన్
కమలము చుట్టు తిర్గుతతి కంజము బద్ధలజేయ నాగమా
భ్రమరసుపుష్ప మేదివిజు పాదములన్ నిడె వాడె బ్రోచుతన్.

సూత్రి—ఏమి! యీదినంబున సభయంతయు విద్వజ్జన సమాశ్రితంబై సకలవిద్యావిచక్షణాసక్తయువక సమాశ్రితంబై నిరతవేదాధ్యయన శీతకిల్బిషపూతజిహ్వాద్వయంగయుత విప్రసాహిత్య మీమాంసాది మహాశాస్త్రావేదాంగోచ్చారణ పూతంబై సంగీత స్వవివిధ స్వర నినాదనిద్రావస్థాపీతై బహుకజ్ఞాన సభ్యయుతంబై హరి చరణారవింద ధ్యానలగ్నైక చిత్తభ్రష్టపాపనిచయ పామర జనయుతంబై వెలంగు మహేశ్వరీపూజానిరతస్వ కటాక్ష విజిత వైరివర్గవ్యాప్త కీర్తికాంతులు యుద్ధహత రాలకుమారసమూహమోచిత బాష్పధారాక్షాళిత వైరిభూపకీర్తి చిత్రలేఖనులు రాజకులాలంకారులీ సభగలరు వైశ్యులప్పుడె నాటకవీక్షణా చిత్తులై స్వచ్ఛవస్త్రంబులదాల్చి స్వకుప్రోచిత తాంబూలంబులారగించిరి. అందరికన్న ముందు యువకులు వృద్ధాసనంబుల కూర్చుని స్వగౌరవ స్థాపనంబునకై వారిడికొనుచున్నారు. సభ్యులారా నేడే నాటకంబునాడి మీచిత్తంబుల మెప్పింపవలయును. ఏమీ యువకధైర్యశౌర్య సాహస వృద్ధశృంగభంగ ప్రకటీకరంబగు నాటకంబాడవలయునా! నాకేమియు దోచుట లేదే!

(తెరలో)

మహాబుద్ధిమంతులమని విఱ్ఱవీగువారుకూడ నాకేమియు తోచుట లేదని బుఱ్ఱగోకుకొనవలసినదేనా?

(నటి ప్రవేశించి)

నటకులు మీయాజ్ఞకై వేచియుండిరి.

సూత్ర—దేవీ నేను సంకటావస్థలిడితి నే.

నటి—లోని కేగుటయే కాని పైకిరానెఱుంగని యభిమన్యకుమారువలె గాబోలు.

సూత్రి—(నవ్వుచు)

చం. వెలదులు బుద్ధిహీనులట ॥ వేదము నేర్వఁగ రాదు వంట యిం
ట లలితభోజనంబులిడు ॥ టాయని పల్కిరి వెఱ్ఱివారలై
వెలదులు నేర్వలేని విద్య ॥ లెల్లడగాంచిన లేదు ప్రీతితో
నుడువన పూర్వపాండితిజ ॥ నున్ కులకాంతల చెంత నాతిరో.

అనునుడి నీవు స్థిరాకరించితివి. సరియే యభిమన్యచరిత్రంబు నాడుమని యా నీ యభిమతంబు.

నటి—ఔను.

సూత్ర—ఏరురచించినది.

నటి—నూతనముగా వెల్వడినది.

సూత్ర—ఏల.

నటి—నూతనవధువువలెనకె భర్తంగ సంతోషదాయకమై వాతగిలిన కొలంది గౌరవంబు వీడునో యీవిధంబుగ నేకవితాకన్యక.

సూత్ర—మున్నీ కవియేదైన నాటకంబు రచించెనా!

నటి—నాటకంబుల కేమికొదువ!

సీ. సంస్కృతభాషలో ॥ శక్తి జూపించెను
ద్రోణప్రతినయన ॥ తులవిహీన
పాత్రంబురచియించి ॥ చిత్తవృత్తినికవి
పండితుల్ మెచ్చగ ॥ పజ్ఞగాంచి

సావిత్రి శృంగార ǂ సాహిత్యకావిద్యల
నేర్పుజూపుచు వ్రాసె ǂ నిఖిలశాస్త్ర
చూడమాణిక్యముల్ ǂ చూపె మన్మథదూష
ణంబులనూత్నాయ ǂ నంబుద్రొక్క

తే. గీ. రోషనారనుచితపాత్ర ǂ పోషణాల మె
లంగ లిఖియించె మతదేశ ǂ రాజ్యకాంక్ష
మనములందుగల్గ మహనీయ ǂ పండితతల
కంపనంబులగొనెకవి ǂ కాంతవించె.

సూత్ర—అటులైన పాత్రపోషణకు సిద్ధముగా నుండవలసినదే.

నటి—ఇంకొక మాట!

సూత్ర—ఏమిటది

నటి—(కొంచెమాలోచించి) ఏమియు లేదు నేపోయినా కార్యంబున మెలంగెద.

సూత్ర—సరిదే.

(నిష్క్రమించెదరు)






ప్రథమాంకము




ప్రథమరంగము.

(దుశ్శాసనాభిమన్యు ప్రవేశము.)

దు.—బాలకా?

చం॥ కదన మటన్న భామినుల । కౌగిట బీరములాడుటంచునీ
మదిదలపోసితే సకల । మానవనాయక శీర్షవాయుసం
చదనముజేయ గుజ్జనల । సల్పుటొ యంబసతీమణుల్ సమీ
ప ధృతనివాప శౌర్యమూర్త్యానసే । బాసనశీవిగమాటలాడుటో॥

అ.—మూఢా ధృతరాష్ట్రా!

సీ॥ సభనేకవస్త్రయగా । సాధ్వినిరమ్మని
యంకంబుజూపుట । టంచుతలప
మాయాళిజూదనం । హరణ రాజ్యసుభోగ
మంకమంచునెరుంగ । నాత్మయందు
నమ్మినజలక్రీడ । దమ్ములబంధించి
నీటముంచుటటంచు । నెరుగనైతి
ప్రేమతోసోదర । బృందంబురప్పించి
విషభోజనంబున । ననువులూడ.
తే॥ గీ॥ దీయుటని నెంచనైతి । దివ్యబాణ
ఘాతరుధిరాప్తి వసనసం । గరడమైక

బద్ధకంకణరిపువర్గ । వాహినీగ
ఘాతమిత్రాప్తివిశసహాయ । నైభవేంద్రి
నౌకలుచరించు చోటని । నాకుదోచె॥

దు—అబ్బా పిట్టకొంచెము కూత ఘనంబనునట్లు వయసున చిన్నవా డవయ్యు ద్రోణశిష్యు తృణీకరించుచుంటివే? బాలకుండవు నీవు నంబెప్పను క్రీడలయందె లగ్నంబగుట విద్యలనుగను ప్రహసా స్త్రశస్త్ర విద్యుండవుకావు. కర్ణాది మహాయోధావృత దుర్యో ధన చమూనిర్ముక్త బాణపరంపరాయస ప్రవైగ్యంబు గనా! యుత్తరాసుస్మితవదనారవింద సుధావశజాతక కృపాంతరంగుం డవై నిన్న విడుచుచుంటివా? క్రీడలయందాసక్తుండవై మెలంగుము.

అ—మూఢా! కర్ణాదిమహాయోధులు గలరని విఱ్ఱవీగెదవు! అభిమ న్యుండు గుడాకేశగోవింద శిష్యుండు వానలెక్క చూ! యు త్తరాసుస్మిత ముఖారవిందంబు గనజాలినీకుగర్వైనా! పిరికితనంబులేని విరాట్ రాజ దుహితకాని భీరుడైనాయక దుశ్శాసను దుహిత కాదు కదా?

దు—మీతండ్రిలుకూడ నీరీతియే సభాస్థలంబనపల్కిరి. సమయమున దేర మూకీభావంబు వహించిరి వారు సుతుండవేకదా నీవు

అ—అట్టులనా?

ఉ॥ ధర్మసుతాజ్ఞ లేనిమొడ । తమ్ములుకర్ణుడు భీష్మదారియే
శర్మదమంచెటింగిరిపు । సాయకఘాంద సహాయమొందియూ
ధర్మతలంబుజేరరె సు । తౌఘ సతీనయనా గతాంబువుల్
నిర్మలనీరమై శ్రీమల । నేర్వదెబాపగ దాహశాంతిచే.।

దు—అభిమన్యా! కదనంబున నీజనకులు మాచే విజితులగుట నిక్కు వంబు. కాననంబున కందమూలఫలంబు లొసంగ వృద్ధజనక

పూజాధురంధురుండవై మెలంగ నిన్నుంజంప జేతులురాకున్నవి

అ—ఔనౌను.

ఉ॥ చండగదాభిఘాతమున । చచ్చుసుయోధన సోదరాళిక
ర్ణుండుకిరీటిచేత యమ । లోకముజేరును గౌరవించివా
రుండు తలంబులివ్వ నిను । రోషముచేయ మభోక్తజేతునా
చండతరాగ్ని బాణతతి । సాధ్వియుగ్ వెనువెంట వచ్చుటల్॥

నై రిపుతుత్రినిపై నీకెంత పేత్రిమగల్గినది. ఇవి భీరుతోప్పదేశమా, లేక మాయాద్యూతమునాటి పేత్రిమయా!

దు—బాలకా నీవేమనుకొనినను సరియే. ముద్దులొలుకు నీముఖంబు గాంచ నరసుతుసుగుణాలవాలు మన్మథాకారునేరీతి కూత్రిరశివ ముఖంబున జంపుదునాయని జాలివేయుచున్నది.

అ—అంతటిజాలిగుండెయానీది? అయిన సాధ్వీలలామ మాయాద్యూతవిజిత భర్తనిండోలగంబున మాంపాహికూత్రిరాదని విలపించు చున్న మాజనని వేణిచేనీడ్తువా! ధర్మాత్మజ బద్ధమదగజంబుల నాజనకుల నెరుంగుట నీడ్తుదత్రిబలంబునుచూపించితి. కౌరవసేనామాహోత్క్షిప్త పత్రితాపాగ్నివరసుతుండు ప్రజ్వరిల్లశాంతివాక్యంబుల దయాసహితవాక్యంబుల శాంతుజేయ జూచుచుంటివి.

ఉ॥ భీముప్రతాపవహ్నినిను । పేల్చునునీ రుధిరంబుగ్రోలునే
కామరిపు ప్రసాదశర । కాండగతీసుయమాలముండగా
సీమనొనర్పజాలుదును । చేసెప్రతిజ్ఞను భగ్నమేలనే
కామముచేత జేయవలె । గావుమటంచువచించి పోనగుగ్॥

దు—అభిమన్యూ! భీముండుచేసిన ప్రతిజ్ఞలన్నియు నెరవేర్చెనా? సుయోధనోరుభంగంబొనర్చె ననియు మద్దురిధరంబు పానంబొనర్చెదననిపల్కె. అవి నెరవేర్చెనా? క్రోధావేశంబున చేయు

నదేమి లేక రోషంబు పెచ్చుపెరగ బల్కువాక్యంబులకు విలు వుండునా!

అ—పాపఫలంబనుభవింప కాలంబాసన్నమయ్యె. భీష్మద్రోణాదిమహాధివాక్య తృణీకారంబను నంకురంబువేసినంతనే కౌరవవంశనిర్మూలనఫలం బనుభవింతువా! దానికి ద్రౌపదీకేశాంబరాకర్షణపుష్పంబులు కల్గవలయు తజ్జాతవృకోదర ప్రతిజ్ఞాఫలంబుద్భవించు. అది పక్వంబై కౌరవరాజ్యనిర్మూలన సంశోద్ఘాటన ఫలంబగును. తెలిసినదా!

దు—కార్యంబులనశక్తులై యేరువినకుండ ద్వారబంధంబొనర్చి మీరాసినతంత్రములు పల్కువాక్యంబులు తలలో మెలంగుచున్నవి కాబోలు.

అ—మూఢా! ద్రౌపదీకేశాకర్షణ సమయంబున భీముండు ప్రళయకాల భీమతుల్యక్రోధుండై నిండుకొలువున నిన్నుచంప ప్రతిజ్ఞనొనర్చె. అది చాటుగనొరులెరుగకుండ జేయుప్రతిజ్ఞయా! నీసోదరుశాసిత సకలభీరువొకుగదా సంచూర్ణితొరుయుంగళుజేయ ప్రతినబూనుట నిండోలగంబునగాదా. శుద్ధాంతంబున నీసోదరుభానుమతీద్వితీయుండై యనివేషిత పాండవ్యమీాయవని యనిపల్కలేదా. దానినాతంత్రములు, వీరజనకులు, వీరజానులు, వీరసుతులు, పల్కిరా. అట్లుపల్కగలరా!

దు— నీజనకుండు బలవంతుడే యగుగాక! నీవుపండితపుత్రుడవా! లేక నీదెస నేదైనప్రజ్ఞగలదా.

అ—నీజననంబుగూర్చి నాకుమిక్కుటమగు సందేహము గలుగుచున్నది. యేరాజ పుత్రుండైన వైరి ప్రశంసజేయునా! నాజనకుని పౌరుషంబును గూర్చి యింకను సందేహమేనా!

సీ॥ గురుదక్షిణ నొసంగ । గోరద్రోణాచార్య

దేవమపాంచాలునో। డించినారు
మకరపీడితగురు। పాణంబుగాపాడి
విమలకీర్తినివేరు। వెలసినాను
రాజసూయాధ్వర। వాజరక్షణమందు
భూనాధశౌర్యంబు। బూదిగలిపె
నెవమశంకరుతన। నేర్పుచే మెప్పించి
ఘోరసాయకతతి। గొనెను సురలు.

తే॥ గీ॥ మెచ్చ పాంచాలినెవ్వడు। మేదినీశ
దుఃఖితాశ్రులపతనమే। దోహదంబు
గాగకర్ణశోభియె పుష్ప। గరిమ సోద
రాళికమపుమంటయె ఫల। మైలలిత శౌ
రీర పాణిగొనెనుపల। లీలకలుగ.

నాపౌరుషంబునుగూర్చి నేనేల నుతింపవలయు. నామలుకలె తెలియబరచును. సింహంబు గర్జనంబుల మత్తేభంబు ఘీంకారంబుల పికంబు మృదుమధుల గీతనాదంబుల లోకంబున కెరుంకయగుగాని స్వప్రతాపంబుల రందిమాగదులచే నుతింపజేయఖు. నాపరాక్రము మదీయవజ్రపుంఖశరంబులే తెల్పును.

దు—అట్లైన యుద్ధంబునకు సిద్ధుండవయ్యెదవా!

అ—నీకుశక్తిగల్గిన.

దు—నకులాపహాయమూనుండనైతి. బాలకుండవు నీకునాతోపోరేల.

అ—మూఢా! పొమ్ము. నాజనకుండు భీష్మునితో బోరుచున్నాడు. నాపౌరుషంబు వానిచెంతనే చూపించెద.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము

(భీష్మార్జునులు ప్రవేశించెదరు.)

భీ.—గుడాకేశా; భీష్ముండను విజయప్రాణహారణి భీష్ముండనై వచ్చుచున్నాను. యింకెక్కడికేగెదవు.

అ.—పితామహా! విజయపంచాస్యంబు రంగంబు శాబకసమావృతరంగంబు విడుచుట సహజమా?

భీ.—గాండీవంబు మహేశ్వరాప్తతపము లో | కారాధ్యగోవింద బా
హుండా భక్తప్రాపనంబు గలదే | మోదంబు గర్వంబు నీ
కుండెన్ చూపుము భీష్మబాణబల సం | కోచంబు తాఁజెందునో
చండారాతిబలంబుగాంచి జనునో | శర్వున్ జెగసన్ ఖిన్నమై.

అ.—తాతా! గాండీవప్రభావంబెఱింగియు నీవట్లు శంకింపనేల. నిన్ను జయించుటకుగాదె వ్యాసబోధితుండనై పరమేశ్వరుతపంబున మెప్పించి గొంటిని. నేటికి నీతో నాకు గలహంబువాటిల్లినది. స్వయముగా నీవు కదనంబునకుం బిల్చుట నాపూర్వజన్మసుకృతము. అన్యోన్యప్రతాపంబులు చవిచూడ నిదేసమయముకదా!

ఉ॥ రామునిజామదగ్న్యుఘన | రంగపరాజితు జేసినాడనే
భీమబలుండనన్ దలపు | వెల్గెడి నీదెసనాకుధర్మమున్
కామముగల్గె వైరులని | గర్వలజేసి వధింతునంచు యే
రోమహనీయులీదినమొ | లోకమెఱుంగును పోరుగల్గినన్.

భీ.—పిచ్చివాఁడా! ఎన్నడైన రణంబున జయంబు సత్యమువలనకల్గునా?

అ.—తాతా! అట్లననేల. యతోధర్మస్తతోజయః యను రహస్యము కృష్ణభగవానుండు పల్కలేదా! శ్రీకృష్ణసహాయ్యంబుకల్గ జయింపరాని మర్త్యులుగలరా!

భీ—అర్జునా! ధర్మంబుచేయనివారెవరు!

సీ॥ తండ్రికోరినకాంత ♦ దయితగాచేయగ
నిఖిలరాజ్యంబును ♦ సిరువిడచి
బ్రహ్మచర్యముబూని ♦ ప్రజల బిడ్డలభంగి
పాలించిపాత్రంబు ♦ బాగుపరచి
వేదాదివిద్యల ♦ వీరశాస్త్రంబుల
నేర్చి యాచరణంబు ♦ నేర్చుపరులు
తప్పుదారులబోవ ♦ దండించిసత్పథ
మందు నిల్పియశంబు ♦ సలర

తే॥ గీ॥ భీష్ముడంతటివీరుండు । పృథ్విలేడు
సకలగుణరాజితుండు శ్రీ । శాంతియుతుడు
కృష్ణపాదారవింద సం । కీర్తనల సు
రపదవాంఛితుండనరెవన్ । బాతివారు.

అ—తాతా! నీవుచిన్నతనంబున ధర్మమార్గతత్పరుండవైన సౌమువు గాక! వృద్ధత్వమున ధృతరాష్ట్రవాక్యంబులకుమోసపోయి సత్ప థంబువీడి యన్యాయంబున కొడగట్టితివి.

సీ॥ మాయజూదంబున ♦ మారాజ్యమునగొన
ధర్మంబుకై పోర ♦ దలచినావె
లాక్షాగృహంబున ♦ రాత్రినిప్పంటింప
ధర్మంబుకై పోర ♦ దలచినావె
విషభోజనంబిడి ♦ వివిధబాధలబెట్ట
వలదనివారి న ♦ త్పథము బట్ట
జేసితివెలసతిని ♦ జీరలవొలిపించి
కొప్పునసీడ్చిన ♦ కుమతిగణము.
మందలించితివేనీవు ♦ బాలబాన

ములకు మార్గముల్ వట్టిరి ♦ భూరికష్ట
చయముసుతకులధ్వంసంబు ♦ సంభవించు
ధర్మబుద్ధున్న చెప్పవే ♦ తప్పులన్ని.

మరియు నిండుసభలో నైదుగ్రామంబులిచ్చిన చాలునని మేము వర్తమానమంపలేదా! దానికైనసమ్మతించిరా' నీవె నిజంబుగాతలంప సంధి కల్గకుండునా!

భీ—కృష్ణా! నీవింకయు ధర్మాధర్మంబులెఱుంగజాలవు. వారికూడుతిను చుండి వారితోఁబోరాడనెట్లగును. నాచేతనైనంత వరకనోన్య మైత్రికల్గ యత్నించితిని.

అ—తాతా! సరిపెట్టుకొనుటకేమిలెమ్ము. ఈరాజ్యంబు, సర్వంబు, మాకుగూడ జెందవలయునుగదా! మాకూడుతినుటలేదా! నీవీ కథారసంబే యుగ్గుపాలుగా మేముకూడ పెరిగితిమికదా! ధార్త రాష్ట్రులవలె మేమెన్నడైననీమాట తృణీకరించితిమా! నేపల్కు నది దీనావాక్యంబులని తలంపవలదు. న్యాయాన్యాయములు చర్చించుచుంటిని. నిన్నుప్రార్థించుకాలము సంధియొనర్చ యి రుపక్షంబుల హాయిగకాలంబు గడుపుకాలంబు పోయినది. రణంబెసర్వంబు స్థిరీకరించు.

భీ—దీనిలోరహస్యమునీకుదెలియదు. నేనకాలంబునకౌరవపక్షంబువీడి మిమ్ములనుజేరిన పాండవులకువెరచి భీష్ముండు పాండునందనుల జేరెనను నపఖ్యాతి నాకేలకల్గవలయు. రణంబున గోవిందసహాయ మేపక్షంబు కల్గునో వారికేజయంబుగల్గు. యిదినేనెఱుంగనిదికాదు. చిత్తంబు మీకు, గాయము వీరలకు నర్పించితి. విధియే దీనికి కారణంబు. కదనభూమి భూభారంబుతగ్గుననియు పాండునందన రక్షితభూవలయంబున ధర్మంబు నాల్గుపాదంబులనడుచునని నేనెఱుంగుదును. నాయవసానసమయంబున ప్రజానింద

లకులోనై పరమాత్మ సమీపంబునకు దూరమవనేల.

అ—తాతా! నీతోఁ గదనంబుజేయ చేతులురాకున్నవి. రక్తభూయిష్ట భోజనంబునకై సుతాదిబంధువుల బూజ్యుల మీవంటివారియో వృద్ధుల జంప నెట్లగును. యింతకన్న ముందుకరవృత్తి భైక్ష్యంబె మేలు.

భీ—తిరిగి వ్యామోహంబు జెందకుము. భగవత్ గీత మనంబుననిడి రణంబొనర్చి ధర్మసంస్థాపనంబున కృతనిశ్చయుండవగుము. యెవ్వని మీమేనత్త కుమారుగా నెంచుచున్నావో యామహాత్ముడే పరమాత్ముండగు.

అర్జు—ధన్యోస్మి తాతా! నీవంటి సాధువరాయులు జగంబునలేరు. పూజ్యుండైన నీతో రంగం బొనర్ప కాళ్ళాడకున్నవి. మేన్లు చెమ్మగిలె. నాపై శస్త్రంబులుపయోగింపకయున్న నేబాణంబులు ప్రయోగింప.

భీ—(తనలో) తానొకవిధితలంచిన దైవమొకరీతి నెంచుననినామనంబుపీనికెటింగింప బంధుప్రేమ చిత్తంబుకలంగ సమరపరాఙ్ముఖుడయ్యె. కౌరవసేనపెచ్చుపెరిగి రిపులదున్మిడయంబుగాంచు అధర్మంబే జయంబుగాంచ ప్రజా క్షోభముత్పత్తిల్లును గాన వీనితృణీకృతవాక్యంబుల బురిగొల్పెద.

(ప్రకాశ) మూఢా! యర్జునా!

భీష్మునోడింప గాండీవ । భీమశస్త్రం
మబ్బెచంపెదనన్ ప్రజ్ఞ । లాడిప్రాల్కు
జొచ్చితేపౌరుషంబు న । శించెనోక్కా-
పేడెచిత్తంబుగల్గెనే । భీష్మగాంచ.

శా॥ గాంగేయున్ బరిమార్తు కౌరవచమూ । కాలాగ్ని దేవేంద్రది
వ్యాంగోద్భూతుడనేని ధర్మజుమన । త్యాహారుడై మొగ్గినన్

భంగంబొందక యున్నగాండివము భూ । పాలేశువీక్షింపగా
రంగంబందని పల్కియుండెవొక గ । ర్వంబుకర్ణ బ్రోమగా.

అ—తాతా! నీప్రజ్ఞజూపెదను. సమస్థలంబునకు వచ్చెదవా!
బీ—సరే? (నిష్క్రమింతురు.)

ర ణ భూ మి .

---

(భీష్మునుప్రవేశము.

బీ—ఓహో సైనికులారా!

ఉ॥ బాలకశౌర్యరాశిమిము । పందలజేసెన ధైర్యకుద్యుమీ
బాలకమూషికంబు చెరు । పఁగనగరే జనులార్యకీర్తి మీ
కాలయముండె కుత్సితువి । కారముజెందయశంబు బోవుమీ
కాలయమౌను కాలయము । కాలయమెచ్చట డాగియుండినన్.

ఓకర్ణపరిభృత మహావీరులారా! అభిమన్యు భయదగర్జన సలితధైర్య సాహసులై యిటునటు పర్విడనేల. భీష్మ భీష్మ ఖగఖగం బభిమన్యు మేఘపంక్తి పటాపంచలజేయును. కర్ణా! దుర్యోధనదుర్బుద్ధి నౌకాకర్ణ గర్వపూరిత వాక్యకర్ణనిహిత కౌరవకుల! బాలకబాణంబులకు పృష్టంబు జూపనేల; యింకను భీష్మమహారథికుండు శస్త్రసన్యాసమొనర్ప లేదు. వైరినాశనోన్ముఖ గృహీతజ్యాబంధుండై రణోర్విసుధాగ్రహణ సమయవార్నిధి చలన్మందరసగంబుగల్ల యనాథలభంగి కదనభూమిప ర్విడనేల. ఓసైనికులారా! పింంమన్యుల భీరులననుసరించి మీరుకూడ భీష్మశిక్షిత సకలచాపరహస్యులు పర్విడనేల.

భీష్మశిక్షితసూరులు । భీరుభంగి
కదనరంగంబు విడనాడ । కాంతలింట
గౌరవంబిత్తురే మీకు । గాలుదండ
వాసమబ్బును వీరనివాస । వాసమూడ.

ఓయభిమన్యూ! మత్ సాయకతీక్ష్ణజ్వాలాసహిష్ణులై భీరులబగది రణంబువీడిరను గర్వంబున గాంగేయుమాట మరచితివి; నాచతురంగబలౌఘమునోడించితినను వికత్థనంబునువీడు. సమరంబుజేయు శక్తిగల్గినన్ను.

(అభిమన్యుడు ప్రవేశించును.)

అ—తాతా! యింతదనుక సైనికులకు బ్రోత్సాహమొసంగుచుంటివి కదా? అభిమన్యుబడబాగ్ని కౌరవచమూధైర్య గేహంబుగాల్చుచుండ భీష్మప్రోత్సాహవాక్య తుషారంబు ధైర్యగేహంబుల రక్షించునా? అదియుంగాక భీష్మతుషారంబుకూడ ఇంకిపోవును.

భీ—బాలకా! నీధైర్యశౌర్యంబులకు సకల భూనాయక శిరోమాణిక్య యోధానుయోధ హృదయస్థధైర్య మహోవృక్షకంపన శక్తమారుతంబు భీష్మక్రోధారుణజ్వాలా కృష్ణవర్త్మాహోలాయమాన దీక్షిత ప్రభంజనకు మెచ్చువచ్చె. దానికన్న శతసహస్రవిధంబుల పెచ్చుపెరుగు భవదీయ వేపనంబునకు హేయభావం బలమడ దాని నివారింపవచ్చిరి.

అ—భీష్మా! శిష్యప్రేమ స్వశక్తనిదునుమ లోకాపవారభీతి నీతో బోరు జామదగ్న్యునోడించుటయా లేక గురుభావంబు తలకెక్కుట గాత్రంబుకంపింప రణోర్వికి నీడ్వబడిన విజయు మూర్ఛిల్ల జేయుటయా? అభిమన్యుతో బోరుటనితలంపుము. దేహంబు కంపింప నాకరవాలమునకు నమస్కారమొనర్చిపొమ్ము. కౌరవ వంశ మూలపుషుండవౌటచే నిన్నువిడచెద.

భీ—నన్నురక్షింపుమని నిన్ను వేడితినా! శక్తిగల్గ చంపుము.

అ—భీష్మా! స్వచ్ఛందమరణంబు జనకుం డొసంగెనని గర్వించి నాపై వచ్చుచుంటివి. స్వచ్ఛందకలహంబు స్వచ్ఛందమరణ మాపాదించును.

భీ—పిన్నవాడవు నీతో నాకు బోరదగినది కాకపోయినను స్వయంబుగ

రణంబునకు నిలిచితివికదా?

తే. గీ॥ ఖగముపారోజాధి దాటగ । గర్వపక్ష
ములనెగురవార్ధి దయగొని । ముంపదొక్క-
బాలకుండని విడువగ । ర్వమతిసర్వ
శూరవర్యులనిందుతు । భీరులంచు.

అ—నీవపారవార్నిధివా! నేనుఖగంబునా! పోనిమ్ము ఖగక్షుభీతవార్నిధి నీవు. మాటలతో లాభమేమి. రణంబుచేయుదువా! నాబాణంబులు నీరక్తంబు బానంబొనర్ప దొందరజెందుచున్నవి. పానంబొనర్పుటయేకాదు. నీశల్యాహారంబుకూడ వాటికిదొడవును.

బీ—గొప్పవాదేజేయుదువే? కానిమ్ము నేవలదననేల. రణభూమికిపోవుదుమురమ్ము. (నిష్క్రమించును.)

రంగము—కురుక్షేత్రము.

సమీరసుతు—భీష్మాభిరక్షితబలంబు భీష్మకిరీటిసుతకలహంబు వీక్షింప రణపరాన్ముఖులై వైరభావంబుల మనంబునుండి బారద్రోలి మిత్రవిధంబున నిలువంబడి గాంచుచుండిరి. నేనెచ్చోటకేగినను జనంబులు కిటకిటలాడుచు నిసుకవైచిన రాలకుండనుండిరి. కొంచము తలంబీయుమని నేనెంతవేడినను లాభంబులేమి. కొంతకాలము పరిజాకింవదంతుల మనంబు సమాధానపరచుకొంటిని. కాని, జనులదొమ్ములాటలో నాబ్రతుకు కెరటంబులత్రాణంబల్లు యొడ్డునకొక పటిపోతునకొకతటి కానవైదైస నున్నతవృక్షంబారోహించి సర్వంబుగాంచెద. (చెట్టునెక్కె) కన్నులున్నందుసకు ఫలమిదియేకదా! బాలకు గుడాకేశసుతునితో వృద్ధభీష్మునకు బోరాటము. ఒకరికొకరు జంకకున్నారే? అభిమన్యుడు నాకన్న ముందర బుట్టినాడే? బాపంబు నాయెదుటనేకదా తప్పటడుగులువేయుచుబట్టె. యింతలో శాంతనుడయ్యెనా! అరరే?

అభిమన్యుకుమారుఁడు శూన్య రథుండయ్యెనే! వాజంబుల తూణీరంబుల దున్మి సారథిఁ గోలల విగతప్రాణుఁ జేసి నభిమన్యుకుమారోత్సాహమునకు జీడపురుగయ్యెనే! కాదుకాదు నేనపోహమందితిని. రథంబునుండి భూమికురికి యమోఘాస్త్రమొకటి భీష్ముపై బ్రయోగించె. పాపము భీష్ముఁడు మరణమొందినాఁడు! సముద్రములన్నియు నీది పిల్లకాలువ గోఁ ప్రాణముపోనొనన్నటుల పరశురామాది మహావీరగణంబుల కీర్తివిత్తంబుల కొల్లగొనిన మహావీరుఁడు కళ్లైయున దెరువని బాలుకుచే మృతిజెందెనా! విధిచేష్టల గ్రాహ్యములు భీష్ముఁడంతటి యోధుండు బాలకునిచే మరణించెనని విజయుఁడనజేయుండని విఱ్ఱవీగెడువారు వెఱ్ఱులని నాయభిమతంబు సేనల కోలాహలంబులు పాండవసేనావారతానంబు చంద్రధర్శనాగత సంతోషంబు పెచ్చుపెరగ జయధ్వనులు మిన్నుబ్రద్దలుజేయ కరవాలంబులు శిరంబుపై గోగిరద్రిప్పుచు రిపుసేనలపై బడుచున్నారు. కౌరవయోధులు నాయకవిహీనులై స్వప్రాణరక్షణార్థమై కాల్బలంబుజూపుచు పడుచులేచుచు వెనుకముందులారయక పోవుచున్నారు. ఆరజోమేఘంబు లాకసంబునావరింప కన్నులుగానరాకున్నవి. యేది యేఘుమ్ఘరవంబొండు వినవచ్చుచున్నదే? (తెరలో)

ఓవృధాగర్వపూరితచిత్తా! భీష్ముండింతలోనె మృతిజెందునంచెంచితివా! కదనంబునకురమ్ము.

తిరిగిశాంతనేయ పార్థతనూజులు డీకొనిరే? సంగ్రామంబు తుములంబయ్యె. సైనికులుతిరిగి సమావేశమైరి.

(తెరలో)

ఓయీగాంగేయా!

చం॥ శరములునీబలంబెరుఁగ । జాలితిసారవిహీన పుంకముల్
వరశరుడర్క నుమల్ పిటికి । వారలొసంగిరి క్రీడిసూతిమె
చ్చిరణవిశారదుండనుచు । జీవమువీడగసిద్ధమైన రెం

డరిశేరముల్ గనఁ మనుజ। నాయకశీర్షులు వీరులుండగా.

ఉ॥ బాపము చేరథంబు రథ। సారధిచెండితి వాజులూడెనీ
పాపనిజంపుటెంతయని। భావనసల్పితె పార్థసూతి బా
ణాపహృతాసుడో మహిత। నామున్నభగేరథ సూతిజంపి స
చ్చాపము కేలగల్లరథ। సారధులుండగ నూడనొక్కటే.

దానికేదియో భీష్ముడు సమాధానమిచ్చుచున్నాడు. సమాధానము కాదు. భీష్మాభిమన్యకలహంబు తిరిగిప్రజ్వరిల్లె. అభిమన్యుడింకొకరథంబధిష్ఠించి భాగీరథీతనూజు నెదుర్కొనియె. వానిజ్యాయుంబులుగ జేసి యగాగకర్ణైకలగ్నచిత్త బిడౌజు బోలుచున్నాడు. అభిమన్యరథంబు రణపవాన్ముఖంబై నాదెసకేవచ్చుచున్నది. కాన దీనిపైనుండి యే సంగతులుగ్రహింతెద.

(యధానిర్దిష్టముగా సూతాభిమన్యులు ప్రవేశించెదరు.)

సూ.—అయ్యోదైవమా! నీవెంతదిర్దయురాలవు! పాండవమయూరమేఘు నభిమన్యుకుమారు నిరీతిగశయింపజేసితివా! అభిమన్య ఆయుష్మన్ అపాంశుశరంబు నీపాలిటికి యమరూపంబై దక్షిణహస్తంబుననాటనేల. శరీరంబంతయు రుధిరార్ద్రమైమెలంగ మూర్ఛావస్థరథంబుననొరగ నీనిర్జనప్రదేశంబునకు గొనివచ్చితిని. అదుష్టభీష్ముచే బరాజితుండవైతివా?

అభిమన్యు—(లేచి) భీష్ముండు నన్నుజయించుటయా! హిమవత్సద్మశదూలరాశి వీహ్నిశిఖలజల్లార్చునా! ప్రళయకాల భయదగర్జత్ గర్జన్యవజ్రంబుల వృద్ధమహీరుహంబు మాయముజేయునా? భీష్మా? యీశరంబునుండి కాయంబు రక్షించుకొనుము.

సా—అయ్యా! భీష్ముండు మీయెదుటలేడు. యిదికదనరంగముకాదు.

అ—(అటునిటుజూచి) యీశూన్యప్రదేశమునకు నేనెట్లువచ్చితిని.

సా—నేగొనివచ్చితి?

అ—కారణంబు!

సా—భీష్మశరాహత తఃప్రాణంబున మూర్ఛజెంద ప్రాణంబులగాపాడ.

అ—ఎవరామూర్ఛాప్తమనది. గాండీవిరథబోదన తత్పరుండగుసుమిత్రుడా! యెన్నడైన మాతండ్రి నీరీతిరణరంగంబునుండి తీసుకువచ్చితివా! క్షాత్రపౌరుష మెరుంగని చందంబున ప్రవర్తించితివే?

సుమిత్ర—ఆయుష్మన్ మీదక్షిణపాణి వజ్రఘాతముచేత గాయము పడి స్మృతితప్పుటచే విశ్రమింప నిటకుదీసుకొనివచ్చితిని.

అ—దక్షిణహస్తంబు తునియలగునెడల దంతంబులేమయ్యె. యేకప ర్యాయము ద్వాత్రింశత్బాణంబుల బీష్మదేహంబు నొప్పించి కిరీటికూడ వీనికిలొక్కేయని యెరుంగజేయకుందునే?

సు—మతిగల్గినయెడలకదా రణంబొనర్చుట.

అ—మూఢా! భీష్మునిర్ముక్త నారాచనంబులు నామేనుచురుక్కుమన మతిరాకుండునా? పోనిమ్ము స్మృతిలేకున్న ప్రాణంబులుపోయి నను వచ్చినహానియేమి.

తే॥ గీ॥ జీవములదాల్చి రంగంబు । జీవితేచ్ఛ
పాఱెనుతుడన గాండీవి । మండిపడడె
కులసుకీర్తియడంగె నీ । కుటిలబుద్ధి
చంపితివినన్ను బ్రతికింప । శక్తిగల్గి.

సు—మీపౌరుషంబె గాండీవివిన్న యానందబాష్పములువిడిచి శిరంబు ముద్దాడియుండును. మీకీచింతలేల గాయంబునకు కట్టుగట్ట నిండు.

అ—నీవెప్పుడు దేహసౌఖ్యములనే జూచుచుందువు. రక్తంబు కాల్వ లై పాఱనిమ్ము. బీష్మువిడచితినను యపఖ్యాతి నేబరింపజాల.

సు—గాయంబునకుగట్టుకట్టినవెనుక చూచుకొనవచ్చును.

అ—రోషావేశవంబున పూజ్యునిన్నుదూరితిని. కానిమ్ము (కట్టుగట్ట)

బాపము బాపను మూఢా! భీష్మా?

ఉ॥ బాలకమూర్ఛనుంచి ఘన బాణయుతుండ కిరీటిపుత్రునే
దూలగనేసినాడనని । రోషముజెందితె భీష్మవాహినీ
కాలుఁడువీఁడు జీవనుల । గైకొనకుండ విడంగభీరుఁడే
చాలునుబీరముల్ నుడువ । సంగరయత్నము చేయమేలగున్.

(పోవుచుండగా సుమిత్రుఁడు వెంటనంటుచు) ఆయుష్మకట్టు వేరిలా
ఁచున్నది. దానినైన సరిగాకట్టనిమ్ము (అని నిలుచుండ కట్టుకట్టును)

అ—భీష్మా! అర్జునభిమన్యులు శూరంమన్యులని తలంచుచుంటివి.
దక్షిణహస్తంబున గాయంబుగల్గె నీనిశ్చటిలో జయింపగల్గుదు
మని విజ్జ్వీగకుము. వామహస్తంబుననే శతకోటి భీష్ములద్రుం
పజాలుదును.

(తెరలో) దక్షిణవామహస్తంబులు భీష్మునొక్కని జయింపలేకున్నను
వామహస్తంబు శతకోటిభీష్ముల దుృంపజాలును.

అ—ఆ! భీష్ముండు నన్ను హేళనచేయుచున్నాడే? సుమిత్రాయింకను
యాలస్యమేల. రథంబాయత్తమొనర్పుము. భీష్మకంఠూనిర్మా
నంబొనర్పక నామనంబు శాంతిల్లదు. వ్రణబాధకన్న నీపరాభ
వాగ్నివేదన మిక్కుటముగానున్నది.

సు—మీతండ్రి భీష్మునెదుర్కొనినాడు.

అ—ఆ! అట్లులనా? అయిన మనము గుడారమునకేగుదము.

(నిష్క్రమింతురు.)

రంగము—యుద్ధరంగము.

(భీష్ముఁడు శరతల్పమై ప్రవేశము.)

భీష్మ—ఖేచరరక్షణైకవ్రత । శంకరపాహిర మావినోదగా.

గ॥ నాతురనారదాదిముని । వందితవర్తన గర్వపూరిత
క్ష్మాపతిభంగరానణ ని । శాచర మారణబద్ధకంకణా

దేహిభవత్పదాంబుజర | సంభవపాప వినాశకా॥

కృష్ణా! నీమాయ తెలియంగ నేరెవరికిశక్యంబు. ధర్మపక్షపాతినగు నిన్ను జనులు వేర్వేరువిధంబుల బల్కుచుందురు ధర్మాసక్తచిత్తుండవు. కాని నీకప్రియులు వైరులులేరు. నేచేసినపాపంబులన్నియు నీచరణారవిందదర్శనపానంబున పోవును. నీప్రాపు పాండవుల గల్గుటచేత ధర్మజానుజుండు జేరి "తాతా! నీవి తెలియంగున రణంబు జేయ నిన్ను విజయింప నేరకగును. మాయందు దయజూపింపు" మనివేడ శిఖండిమూలముగ యుద్ధంబుజేయ జయంబుకల్గునని నుడివితివి. వారాప్రకారము వచ్చిరి. స్వేచ్ఛామరణుడ నగుటచే పుణ్యకాలంబు వచ్చునంతవరకు నేనిక్కడ నుండెద.

(దుర్యోధన దుశ్శాసన-ద్రోణాశ్వత్థామలు ప్రవేశించెదరు)

దుర్యో—హా!

చం॥ రిపులవధించి రాజ్యమున | రెలగమునెల్లరు మించి భూమితన్
జనమున దృప్తుజేసి నృప | జాలము మెచ్చగ నాకవాసహా
నుప్పథిలికీర్తినిల్పు నను | నోగతవాంఛలు నీరునంచెన్
విపులపతిశిఖండి నిడి | పిల్చెనె గాంధివియోధకాముడై.

అశ్వ—గాంగేయా!

తే॥ గీ॥ నీవు విడనాడ భువి సత్య | నేతిలోట
ధర్మమనుగంటు పాపులు | స్తుత్యులౌదు
రవనిబోధలనేర్చి న | ర్వావనీశ
నుతులగౌరవమొందు మా | నోన్నతతుల.

ద్రోణు—నేవాంఛించునదికూడ యదియే. నీవంటిమహాశూరులు దుష్టచిత్తులు సన్మార్గులజేయువారు భువివీడుటమాదురదృష్టమే.

దు—తాతా! రణంబున జయంబుబొందు నుపాయము మాకెఱుంగ జేయవా?

భీష్మ—దుర్యోధనా! మావాక్యంబులనీవు నిరాకరించి సంధిబోధో్రసి

శ్రీకృష్ణు చిదానందస్వరూపు సంధియొనర్ప యత్నించునతని బంధింపయత్నించితివి. సోదరుల కవగింజంత భూమినీయనని శౌర్యముబూని ద్రౌపదీకేశాంబరాది మహాపాప కార్యంబుల నొనర్చి హృదయస్థ మాయాపిశాచంబుపైకి వెడలగ్రక్కితివి. మాయాద్యూతంబున పాండవుల నిర్జించినదెందులకు. సకల భూమండలమేకచత్రముగ పాలింపతలంపుతోడగాదె! అదినీకు సాధ్యమగునా? భీష్మాదిమహావీరావృతుండవని విర్రవీగినావు. భీష్ముడేదశకువచ్చినాడో చూచితివా? యింకద్రోణుండు ద్రోణుండననేల భగవాను కృష్ణుకెదురుగనిల్వగలరు. కర్ణుమాటయా నీవుతలంచునది. ఈకర్ణాదులు గోగ్రహణసమయంబున చేసిన ఘనకార్యమేమి. వారాతతజూపించిన పౌరుషంబేమి. నామాట నమ్ముము కర్ణుండునీకు హానికలుగజేయును. గాని, మేలొనరింపలేడు. పాండవులు కర్ణభక్షకులైనను వారికికొదువలేదు. నీవు పంచభక్ష్యపరమాన్నములు భుజించినను వారికిగల్గుకీర్తి నీకురానేరదు. కారణంబేమొ యూహించితివా? వారిపై మాబోంట్ల ప్రేమకు గారణంబేమొ నీవెఱుంగుదువా? వారిన్యాయప్రవర్తనము, వారివినయవిధేయతలు, వారిస్వచ్ఛందగుణములు, నీపై పూర్ణాభిమానమేరికిగలదో కొంచమాలోచింపుము. నీదృష్టికిగన్పడువాడు కర్ణుడొక్కడే. వానియభిమానము నిష్కళంకమైనది. పిల్లకాలువకెంత యభిమానమున్నను బడబానలమార్పజాలునా? ఫల్గుణపరాక్రమ వారాశికి కర్ణసేతువుగట్ట నాలోచించుచున్నావు. నిరర్థకము. నిండుసభలో పాండవులొనర్చినప్రతినలు మరచిరనుకొంటివా? భీమశార్దూలంబు దుశ్శాసన పీనరోరురక్తంబు గ్రోలకుండ శాంతిబొందునా! దానితోనైనదృప్తిజెందునా! చంచత్ భుజభ్రమిత చండగదాభి ఘాతసంచూ

భీష్మ—నిరతంబు కృష్ణకృపారసంబు పార్థునిపై ప్రసరింపుగాక. (దుర్యోధనుజేస గాంచి) వీరోచిత శయ్యాప్రధానము నాకిమ్ము. నీవలనఁగాదు. అర్జునా మతంబు నీకెఱుంకయా?

అర్జు—చిత్తము. (శరోశథాన మొనర్చును)

భీష్మ—పానీయము పానీయము.

దుర్యో—స్వచ్ఛపరిమళలఘుశతర । సలిలవాంఛ
గ్గైనా భీష్మ.

భీష్మ—యోధుకు । ప్లుణుండే
తగినజలమిచ్చిచేయును । దాహాశాంతి.

దుర్యో—ఆకోరికనుడివిప జేయుటకు శీఘ్రముగానున్నాను.

భీష్మ—పాతాళగంగ కావలయును.

దుర్యో—దుస్సాధ్యము.

భీష్మ—అర్జునా!

అర్జు—పానీయమిదిగో. (అని శరసంధానలబ్ధ పాతాళగంగనీదును)

భీష్మ—దుర్యోధనా! అర్జునశరనై పుణ్యము గాంచితివిగా! సంధియొనర్చిన శ్రేయంబు. మిత్రులారా! మీరుమీ స్థానంబులకుబొండు నేభగవద్ధ్యాన లగ్నచిత్తుండనయ్యెద.

పాండవశిబిరము.

అర్జునప్రవేశము

అర్జు—సీ॥ కన్నతండ్రితెఱంగు ♦ కష్టంబులంజెంది
విలువిద్యనేర్పుకు ♦ శలతనిచ్చె
తాత తాతాయని ♦ దగ్గిరజేరిన
ప్రేమపూరితమహా ♦ రిపులకధలు

జెప్పివీరరసంబు ♦ చెవులలోఁబోసి శూ
రాధివరులనుచు ♦ రాజలోక
మందుపేరునిలిపె ♦ హావభావంబుల
మాక్షేమమేగోరు ♦ మహితశక్తు

తే॥ గీ॥ డతఁడుదివికేగె దానికే। నగుదుకార
ణంబు రాజ్యలోభంబుచే। నాకజలధి
సుతుశిఖండి ముందిడిచంపి। తతులవీర
గణముశోచినధర్మ్మ। దనమనగ.

మాయందలిపక్షపాతముచే నీమరణరహస్యంబునుసువ కఠినాత్ముండనై నిన్నుచంపితిని.

కృ ష్ణు డు ప్ర వే శిం చు ను.

కృ—బావా! విచార పూరితచిత్తుండనై తివేమి.

అ—ఆ?

కృ—కారణంబు

అ—భీష్మవధయే?

కృ—రణంబున జితులు, విజయులు, కల్గుచుందురు. అందరుమరణింతురు. దానకై వగవనేల.

అ—ధర్మయుద్ధంబున ప్రాణంబుల గోనవచ్చును. ప్రాణంబులర్పింపవచ్చునుగాని, మృషావీరుండనై పితామహునక్తవనిత ముందిడి వనితావిధంబుసంజంప సంతోషంబుకల్గునా?

కృ—"యేనకేన ప్రకారేణ యేనమారయేదిప్రుమాణవే"
రోగవారణనైద్యస్య యేకం భేషజంమతం.

యనులోకోక్తివింటివా?

సీ॥ పగవారిసేసల ♦ వగగూర్చునెవ్వని

యతుశ క్తియటంచు ♦ పాడలినావో
సింహగర్జనతుల్య ♦ సింహహృదయవీత
ధైర్యుడంచెవ్వని ♦ తలచినావో
యెవ్వానినామంబు ♦ కవ్వడిపౌరుష
దంతిసింహంబని ♦ తలచినావో
శంఖారవవిజితా ♦ శాధిపతియంచు
నెవ్వానితలచితి ♦ వీవుమదిని

తే॥ గీ॥ భీమగజశృంఖలంబు స । ర్వేశచరణ
ఖడ్గవిజితధర్మసుత స । త్కర్మభటుడు
యెవ్వడో వాడు నీపుణ్య । మేమొకాని
నిధనమర్మంబు తెల్పెర । నేజితుండు.

అ—చం॥ జయములభింప నిమ్మురణ । సంహరణాఖిలసైన్యవర్గ భీ
మయమతనూజులాది ముద । మందగనిమ్మురణోర్వి భూపతుల్
జయజయ ధర్మరాజమను । చంపకవీడుమటంచు వేడుతార్
భయముననిందపోవునో సు । పర్వనదీసుతు జంపదోప్రిహినై

మఱియు కృష్ణా?

ఉ॥ పోట్లకుపేరిమసాగరు సు । పుత్రజితుజంపెను కిరీడినిన్నునే
నెట్టులదుర్గింతునంచడిగి । యిస్సిరొపౌరుష ముండెనేశివ్రు
మొట్టినవీర్యశౌర్యములు । పూడెకిరీటి వృథాభిమానియున్
కట్టయశంబుపోనొనిక । కాల్పనెకృష్ణమదీయ శౌర్యముల్.

పాతగ్రింబను నామంబున చేయరానికార్యంబుల నాచేజేయించితివి.

కృ—పిచ్చివాడా!

సీ॥ మదహారిశంకరు ♦ మదవృద్ధకరమార
శస్త్రాలనింపడె ♦ చాటునిల్చి
సుందోపసుందా సా ♦ సూయచిత్తమదన

రూపంబుచేచంపె ♦ లోకహితము
భ్రాతృకలహముల్ ♦ గాంచదాన౯ కృష్ణు
కపటకీర్తిగల్గెనే ♦ కాంతరూప
ధారణంబున పంధ ♦ తెప్పెనసరియైన
జయవాంఛయత్నింతురి ♦ జనులువిడులు
వలదుదుఃఖంపభీష్మ చం । పనఘమబ్బ
నంచుమార్గముగాంచరు । నరులుఫలమె
గనుదురిదియెర్గియర్ధంబు । జనునుచేయ
ఫలముసైరినాశనరాజ్య । పదవిసుమ్మ.

అ—నీమతంబునుబట్టి మార్గంబేదియైనసరియే రాజ్యసంస్థాపనంబుకర్తవ్యమంటివి. కాని రణంబేనాకుసరికాదు. అందులోన ధర్మయుద్ధము.

కృ—అభిమానపిశాచంబు నిన్నింక విడువదుకదా! చంపువాడవు నీవా! చంపబడువాడు భీష్ముడా! నేబోధించిన వేదాంతమంతయు బూదిగల్పితివా?

అ—బావా! వేదాంతమభ్యసించుట దాని నాచరణయందిడుటయును విషయంబులు వేర్వేఱు.

కృ—పోయిసహోదరి సుభద్రిచూతుమా?

అ—సరియే.

(ప్రథమాంకము సమాప్తము)





# పద్మవ్యూహము

## ద్వితీయాంకము.



[ప్రవేశము:—శకునిదుర్యోధనులు.]

శకు—దుర్యోధనా! ననెడచ్చటికిఁ గొంపోవుచున్నావు.

దుర్యో—మామా! రహస్యవాక్యమొక్కటి నీతో చెప్పదలంచుకొని నిర్జనప్రదేశమునకు దీసుకొనిపోవుచున్నాను. అంతకువిశేషం బేమియులేదు.

శకు—అంతటి మహారహస్యమేది.

దుర్యో—తినఁబోవుచు రుచియడుగనేల? నీతో వచించుటకేకదా నిన్ను దోడ్కొనివచ్చితిని.

శకు—ఐన నాలస్యంబేల?

దుర్యో—చెప్పెదనువినుము. మనదుర్భాగ్యముచే మహాయోధుండగు భీష్ముండుగతించె. ఇఁకసేనలనడిపింప దగుండనాథపదవి నలంకరించుట కర్హులెవ్వరాయని యోచించుచుంటిని. చిననాటినుండియు విక్రమవిద్యలందు పాండవులనెల్లర సమీపంబుగా శిక్షించియింతవారిగా నొనర్చిన యసమానవీరుండు ద్రోణుండు అలనాడు ప్రదర్శనశాలయందు దుర్యోధనునికై క్రీడిపై డీకొనితన సర్వస్వమునునాత్తవినియోగించుయోధానుయోధుండు కర్ణుండు. వీరిలో నొకరికొకరు తీసిపోవువారుకారు. ఇప్పుడిర్వురిలో నొక్కరు నధినాథునిగా నెన్నుకొనవలసియున్నది. ఇందునీమ

తంబేమి?

శకు—ఏమి! నీకుపిచ్చపట్టినదా యేమి? కర్ణుండన్నచో నల్వురుద్రోణు లప్పట్టు. అదియునుంగాక ద్రోణుడన్నచో చిన్ననాటినుండియు పాండవ పక్షపాతియింటభుజించి యింటివాసముల లెక్కించి న ట్లాతడిప్పుడు మనకు ప్రతికూల కార్యక్రమంబుంగూడ ననుసరించిన ననుసరింపవచ్చు. అలనాటినుండియు కర్ణుండు మనకై పడినపాట్లెన్నియని యెన్నందగునా?

దుర్యో—అగుననును. నిక్కమమే వచించితివి.

గీ॥ కౌరవాన్వయ బీజంబు గంగసుతుడు
చనిన సేనాధిపత్యంబు తనకు నీకు
కర్ణహస్తంబులం దిడు కారణమున
కిన్కఁగొని ద్రోణుడే రీతిపూనకుఁ గొనునో॥

శకు—ఇంకను నీకావిచారమేల? కర్ణునితో పోల్చుటకు ద్రోణుడెంత వాడు. వలయునేని పాండవ పక్షంబునవానినిఁ బోరనిమ్ము. ఒక్క ద్రోణుండుకాదు అట్టివారుపదివేలమంది ద్రోణులఁబోరనిమ్ము క్షణకాలంబునఁ జయలక్ష్మి కర్ణుని వరింపకమానదు.

దుర్యో—కీడెంచి మేలెంచుమనికదా పెద్దలుచెప్పుదురు

శకు—ఐన?

దుర్యో—ఐన మరేమియులేదు. పక్షద్వయంబులరెంటినిఁ జక్కగనారసియేకదా! యెట్టికార్యము నేను యొనర్పవలయు.

శకు—ఈశతుర్దశ భువనంబులునుఁ దలక్రిందులైన పక్షమున మనయత్నములు తారుమారగును. పక్షాంతరమున నట్లైనను మరొక్కసారి యుధిష్ఠిరునితో జూదమాడునెడల మఱలవానిని జోగిగా నొనర్పవచ్చు. అతకి జూదమందు గలయాశక్తి యింతయంత

కాదు. ఇట్టి ఘోరసంగ్రామరంగమందైన నాతని ద్యూతమున కాహ్వానంబొనర్చినచో నాతఁడు తిరస్కరింపఁడు.

దుర్యో—

శా॥ గాండీవాఢ్యుఁడు, క్రీడి, యింద్రజుఁడు, వీరక్షత్రంబరారాతి ను
ద్దండప్రజ్ఞచె నీల్గజేసిన మహాయోద్ధాముండుఁ గామూదకీ
చండప్రస్ఫుటశక్తియుక్తగదచే చాలంగ భీముండునుం
దండంజేరుచు రక్షణల్ జలుప దీత్కార్యంబు సిద్ధించునే ?
సిద్ధించుటయే దుర్లభంబుగాని సిద్ధించినపక్షమున నాతనిద్యూతమునకీడ్చుటయొక మహాకార్యముకాదు.

శకు—అందులకొక్క యుపాయమున్నది. అద్దానిచే మన పన్నాగంబులు ఫలితంబులు కావచ్చు.

దుర్యో—అది యెయ్యది ?

శకు—చెప్పెదను వినుము.

ఉ॥ "ధర్మజునెవ్వడేని నిశితాస్త్రపరంపరచేతఁబట్టి త
త్కర్మమెఱుంగజేయుటకు గైకొనివచ్చిన నాదుచెంతకుం
నిర్మలవృత్తినాతనికి నిత్తును హీనధనంబు; వానినిం
బేర్మిని సర్వసేనలకు నేనొసరింతును దండనాథుగా."

అనుచు నీవొక్క ప్రకటనంబుఁ గావించిన పక్షమునవ్వండైననుధనాశచే వానిఁ గొనిరాకుండునా? కావున నదియేమఁటకు గర్తవ్యము అట్టిపైన వానిని ద్యూతంబునకు బిలువవచ్చు.

దుర్యో—అటులనేయొనర్చెదను. పోదమురమ్ము.

(ఇర్వురు నిష్క్రమింతురు)

## ద్వి తీ య రం గ ము.

[ప్రవేశము—కృపాశ్వత్థామలు]

కృపు—బావా! విశేషంబులేమి?

అశ్వ—ఇంతకును మహావిశేషం బొందుకలదు. అదియెద్దంటివేనిచెప్పెదనువినుము. శుభంబున కారారాజు కర్ణుంబోసంగకుండుటయు నశుభంబునకు గడంగుటయు మహావిశేషంబులు.

కృపు—సరి సరి! దేవతలకు పంచాంగము జెప్పెదవాయేమి? ఇది యేనెఱుంగనిదికాదు. కాని, రాజ్యలక్ష్మినా రారాజునకుఁబట్టి యిచ్చెదనన్న కర్ణుఁడేట్లుపోరుచున్నాడో?

అశ్వ—కం॥ దక్షిణ గోగ్రహణంబున
దీక్షింపమె కర్ణుశక్తి; వినియుండమె త
ల్లక్షణము సాయకంబున
శిక్షింపగ నరుల? వేరెచెప్పగవలెనే.

ఉ॥ గాండివమూని పార్థుదరుగఁ సమరంబును సేయలేక పా
రండాకోలావులేక? నిజలక్ష్యము నేటికివృద్ధిఁబొందనే?
చండతమాస్త్రకీలల బ్రశస్తగతిఁ రెపువర్గమూహ్చ యు
గ్గాండివికీతడా యెదురుగనిలచున్ సమరంబుచేయగన్.

శా॥ గాండీవక్వణ మాలకించినను నిక్కంబాతనిఁ జూచినఁ
గుండెల్ ఝల్లుమనంగ కర్ణుడెటురాకుంటుఁ గృపఁ వేడశ్రీ
దుంటుఁ సారథి కృత్యమూనునెడదా జెల్యాందుచో గ్రిడి కె
వ్వండోసాటికి? కర్ణుకృత్యమును జెప్పఁ వాంఛితంబానోకో.

కృపు—అగునగు సదినిక్కు నమేకాని వాడు సభాస్థలిని తనమానంబు గాపాడినంములకంగాధిపతిగానొనర్చినందులకు కృతజ్ఞదాతగానో

నర్తునన్న కార్యము సఫలంబగునాయని శంకించుచున్నాడను.

అశ్వ—తాతా! ఇంకను నీకుశంకయేల?

ఉ॥ ధర్మము పాండుపుత్రులది తద్దయువానికి దక్కుభూమి; దు
ష్కర్మము వీరిపక్షమున గాన పరాజయ మబ్బువీరికి
కర్మఫలంబుమీరగ నొకండును శక్తుడె! దైవమన్న నీ
కర్మఫలంబకాదె? రథికాగ్రణి యింతగ చింతచేయవే?

కృపు—అదిగో! దుర్యోధనుడిటకే వచ్చుచున్నాడు.

(దుర్యోధనుడు—ప్రవేశించును)

కృపు
అశ్వ } —మహారాజా! స్వాగతము.

దుర్యో—అయ్యా! రాధేయుండెందున్నాడో మీరెరుంగుదురా?

(తెరలో)

ఉ॥ సంధియటన్నమాట ననిశంబును భీష్ముడు బోధచేయు;గ
ర్వాంధులతోడ సంధియెటులబ్బును? కౌరవనేత తండ్రియా
యంధుని వాక్యముల్ విన ననాహమే ఘటియిల్లుగాని త
త్సంధి కొడంబడం దలపజాలరు దిగ్విజయంబు చేసురక.

కృపు—అయ్యది రాధేయునికంఠస్వరంబు తెరంగున వినవచ్చుచున్నది

(కర్ణుడు—ప్రవేశించును)

కర్ణు—అబ్బబ్బా! యీసంధిమాట వినజాలము. పాండవ పక్షపాతి యగు భీష్ముడెంతచెప్పినను సంధియొనర్చు కొండనియేకదా? తనకు వారలయందుగల యభిమానము సర్వము నిప్పుడు ప్రకటించుచున్నాడు.

దుర్యో—అది నిస్సంశయము. కాని యీవాక్యములు పదేపదే ర్పెటించుటవలన ఫలితమేమి?

అశ్వ—యేమి? భీష్ముండు పాండవపక్షపాతియా? నీవుపాండవద్వేషివా?

కర్ణ దుర్యో — నిస్సంశయముగా నట్టులే.

కర్ణ—ఆతఁడొక్కఁడే కాదు. నీవును నీతండ్రియు నట్టివారే? అట్లు కాదేని

మ॥ అభిమన్యుఁడరుదేర నీజనకుఁడాస్యంబందు తానుండి నై
ర భయోత్పాతగ భీకరూపముల నుర్వీనాథులం జెండి, య
న్యభృత్రోద్రిక మహత్వసంహరణ సద్వ్యాపార లగ్నాత్ముఁడై
య్యభిమన్యుంఁడు చొరంగవ్యూహమున సేయన్ లేదెమార్గంబుతాన్.

మఱియు నెన్నట కిన్నియన్నియనియా? కౌరవనాయకుని యండదలదా
చిక్కొనియుండియు నాతని పార్థునిపైఁగలపేరిమ · యింతయంతయనఁద
గునా?

శా॥ ఇంటన్ మెక్కుచు నింటివాసముల లెక్కించెన్నుమీ యన్నటుల్
కంటంబుల్ ఘటియిల్ల నీనృపతికై కార్యంబులన్ జేసి; నీ
కంటన్ నిష్ఫలబోసి కొన్నఖలుఁడా! గై కొందునేనిన్ను? నీ
కంటెన్ మూర్ఖ శిఖామణుల్ గలరె? లెక్కల్ చేయగా నేటికో.

కర్ణ—నీవలె నీచంబగు కార్యములొనర్చుటకు బ్రాహ్మణుండనుకాను.

సీ॥ ఇంద్రుఁడు చంద్రుఁ ♦ డీవంచు నీచుని
నుతియింపగా ♦ బ్రాహ్మణుడనుగాను
ఒకరి విత్తముదిని ♦ యొకరికినుపకార
మొనరింప ద్విజుడనై ♦ యొప్పుచుండ
దీనతయొప్పగా ♦ దేహీయన్ యాచింప
నధమ విప్రుని ♦ జన్మ నందలేదు
శాంతమంచువసించి ♦ శత్రువులను రిహా
శ్యంబుగా గూల్ప ♦ ద్విజాతుఁడ నాకో?

గీ॥ కాని రాడ్వంశ । దీపమై రాజలంగ
నరిభయంకర రూపమై । యలరికవచ

కుండలములతో । బుట్టిన చండశౌన
నుండుకర్ణుండటంచు । నీవుండుబీతి॥

మఱియు.

గీ॥ స్వచ్ఛ మైనట్టి । గంగలో జన్మమంది
యల సుయోధను డంత రాజ్యాధిపతి చె
లిమిని గైకొన్నవాతోడ । లీలనీవు
సాటిబొందగనేర్తు । యేజన్మమందు.

అశ్వ—ఓరోరీ! నీవేమియో మితిమించి పేలుచున్నావు. ఇక నుపేక్ష
చేయరాదు. ఏమనిచెప్పుచుంటివి? నీవుద్విజుడవు కావనియా!
ఔను నీకుద్విజత్వమెట్లు ఘటిల్లును?

సీ॥ వేదార్థమెల్లను ♦ విశ్వమంతటబోధ
చేసి మిమ్మోమము ♦ మాచేతగాదె?
కర్మమయంబైన ♦ క్ష్మాతలంబెల్లశా
సించుభూసురుడు ♦ భూజించుమిమ్ము
బ్రహ్మణోచ్ఛిష్టంబు ♦ బ్రహ్మాండమంతయు
ననువాక్య మెన్నడు ♦ వినవెనీవు
భూసురమహిమచే ♦ భూతలంబెంతయు
పారితంబన్నట్టి ♦ పలుకువినవె?

గీ॥ ఇంతమహిమగలట్టి । బ్రహ్మాంశుసంత
తినిజననమొందు । సద్గతియొనర గలుగు
నాక్కొమెన్న । డేనియునీకు? నొక్కపలుక
వచ్చునెన్నటికైన । లభ్యమ్ము కాదు.

గీ॥ విశ్వమంతయు । సృష్టించి వివిధచిత్ర
లీలలను పాలనము । చేయుజాలునట్టి
బ్రహ్మకులమందు । జన్మంబు లభ్యమౌనె

నిన్నుబోలిన । నీచులకెన్నడేని.

మఱినీవిషయము నీవతి జాగరూకుండవై యాలకింపుము.

కం॥ అన్న బ్రాహ్మణులందున
నెన్నడు ద్వేషంబుగలుగు? నిక్కువ మవే
సన్నగిలు నతనిజీవం
బెన్నగమరణించు త్వరగ హేయపులీలన్.

గీ॥ అంత్యకాలంబునందు । బ్రాహ్మణులపైన
ద్వేషమబ్బెనునీకు । నందియును లేక
రుజము చెడియెడి । కాలానకుక్క మూతి
పిండెలనియెడి । సామ్యంబు పొందుపరుప.

కర్ణు—ఇకచేయగలిగిన దేమున్నది? లంజనులంజయనిన నీతల్లి లంబు; నీవారందరులంజయెయన్నట్లు నీయందుదోషారోపణగావించిన ప్పుడుతద్దోషంబు వాపుకొనుటకు బ్రయత్నింపక యెదుటివాని యందున్నవియు, లేనివియు, పదిదోషములగల్పించిగుప్పుటయా?

అశ్వ—(తనలో) ఇంతవరకు నుపేక్షయొనర్చితిని, ఇఁకనుపేక్షచేయరా దు. (ప్రకాశముగా) ఓరీ! రాధాగర్భభారభూత; ఏమిరా!వదరు చున్నావు! ఇంతవరకు నేమియోయని యూరకొంటిని ఇకయూ రకుండరాదు.

ఆ॥ వె॥ ఇంతదనుకనింక యేమేమొయని యూర
కుంటిగాని యిక మఖోనియక్ష
మైన శంకదుంచుగాని యూరికయుండ
నీదుశిరముఁ గూలనేయువాడా.

కర్ణు—ఈప్రలాప వాక్యములకేమిలెమ్ము. కాని,నీనోరును గట్టిపెట్టుకొ నుము. లేకున్నయెడల నీకుదురంతమువాటిల్లు.

అశ్వ—ఓరోరీ! మూఢా! నన్ను దూలనాడుటకు నీకెంత ధైర్యమబ్బిన

దిరా! కాచికొమ్ము. ఇదినీకాసన్న కాలము.

మ॥ ననుదూషింపగ నూరకుంటివిర । కర్ణా!మద్గురున్ దూలనా
డిన నీనాల్కను కండకండలుగ ॥ ఖండింపంగ దోషంబె? మూ
ర్ఖ నినున్ సైతునె? మచ్ఛరానములచే । గాల్పంగ సైరింతునే?
జనకున్ దూలిన నిన్ను । వీడికయె యస్త్రాఘాతమున్ గూల్చెదన్.

కర్ణు—ఈప్రలాప వాక్యమ్ములకేమి? చేయనేర్తువేని క్రియారూపమున
జూపుము. జల్పితమ్ముల వలన బ్రయోజనమేమి?

అశ్వ—మాటలతో పనిలేదనుట నేనెఱుంగకపోలేదు.

గీ॥ గార్ధభంబులు దండిత కారణమున
గాదె కార్యంబొనర్చును నీకు
దండనమె ముఖ్యమంచు శుద్ధాంతరంగు
డైన ద్రోణజుడెరుగడే? జ్ఞానమునను.

దుర్యో—ఇక వాగ్వాదమూనిన లాభము కాన్పింపదు. ఓ అశ్వత్థామ క
ర్ణులారా! మీరన్యోన్యవైరమును మానుకొనుడు.

అశ్వ, కర్ణు—(సరోషులై నిలచియుందురు.)

దుర్యో—మనమిక నిష్క్రమింతము.

(అందరు నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము

సమాప్తము.





# పద్మవ్యూహము

## తృతీయాంకము.



(శయ్యాతుఁడై యభిమన్యుఁడు—ప్రవేశించును)

అభి—(మెల్లగలేచి నిట్టూర్పువిడిచి) అయ్యో! రణరంగంమున చరించు నాకీచెలయేల.

ఉ॥ వైరుల ఖడ్గతీక్ష్ణమున । బారగద్రోలి యశోవిరాజి తాం
గోరు నృశీర్షరత్నకిర । ణోజ్వలపాదము శూరదేహముల్
వీరరసప్రధాన గత । భీరుకిరీట పలాదికర్క శా
సారమ దేభ దంత శర । సంగతబాధము ద్రొక్కకుండనే.

నాపాలిటికి భిషగ్వరుండను యముండై వచ్చి బాధానివారణ నెపంబున నన్ను చంపుచున్నాడు.

సీ॥ శంఖరవములు గాం ♦ చ సమరవీరని
హారకాంక్షితచిత్త ♦ మార్ణవంబు
భంగినలలకల్గి ♦ వైరాగ్యక్రోధంబు
లావరించునుశాంతి ♦ యడగిపోవు
నాగఘీంకారస ♦ భోగనాయకకృత
ప్రోత్సాహవాక్య సం ♦ పులికతాంగ
రక్తవాహిని ప్రిణ ♦ రాజి జిమ్మునిదుర
రానీదు వచ్చెనా! రాజశీర్ష
చేదనాసక్తవీర భూ ♦ చిత్తభయద

సింహగర్జన తుల్యమై ♦ చెలగురవము
చెరచుమెప్పు శయ్యనువిడి ♦ శీఘ్రగమన
తురగయుతుడౌచు వైరుల ♦ దురిమువాడ
ననుచు చింతింప కన్నుల ♦ కునుకులేదు.

ఇట్టిస్థితిలో విధివశంబున నిన్నరాత్రి నిదురజెంద వింతకలయొండుగాంచితిని. రణంబున శత్రుసేనల దున్మాడుచుండ హాటక కమలమొండు నాసమీపంబున నిల్చెనట. దానిలో సుందరవిజితమార దయితాకార యగు నొకవనిత నిలువంబడి నాకై చేసన్నజేసెనట. సుందరవదన దర్శనామృతాభిలాషినై భాతృవ్యుల పితృవుల పరిత్యజించి యామెం దరిజేరినట. ఆమె ప్రళయకాల చండికారూపయై నన్ను గబళించెనట. ఈకలకర్థమేమియో. కలకర్థముండునా. అయిన నాలోనేచింతించెద చండిక ప్రత్యక్షమగుట మృతి సిద్ధమగుట సత్యంబు. అది క్షేత్రమందునా! వనితామోహనాస్త్రంబుల కెరమై జీవంబులబాయుట కిరీటి పుత్రునకు యూర్వశి సౌందర్యాగ్ని శలభం బాత్మకాకుండ రక్షించిన గుడాకేశునకు పుత్రుండనై కేశవభాగినేయుండనై రమణీదృక్పాతంబుల వినాశితబుద్ధి జనితోన్మాదుండనై యమగేహంబున కేగుదునా. అది యసంభవంబు. ఓసర్వేశ్వరా! నాకు మరణంబే యాపాదించు నెడ రణంబున భూలురవై రిశిరోమధ్యంబున వీర, పురుష రక్తనాళనివత్ రుధిరార్ద్రభూమిని నాకాయంబు జీవరహితస్థితి నిద్రింపయనుజ్ఞనిమ్ము. కాంతాకరతలరాగ రక్తతలంబున మరణింపవలదు. పరిమళ సుగంధి ద్రవ్యశోభాయన శిరోజమహిళాఖ పద్మయుతసరసీ మధ్యంబున బోనేగోరను.

[ఉత్తర— ప్రవేశించును]

సతియిటుకూర్చుండుము.

ఉ—నాథా! సేమమా? గాయమెట్లులున్నది.

అభి—వామహస్తంబు గుణయుత దక్షిణహస్తంబును కర్ణసామిప్యము ను పొందుమనుచున్నది.

ఉ—నిరతంబు కదనవార్తలేనా! కొంచము మానుచున్నదా?

అభి—సంగ్రామమున్నంతవఱకు భీరువర్ణనంబులు మానవు.

ఉ—నాథా! కొంతసేపు నిద్రింపుము. (యని విసురుట నభినయించును)

అభి—(కన్నులుమూసి) (తనలో) వనితకు పతియందెంతయభిమానము. అరరే! యీప్రేమయే నామరణంబునకు కారణంబగునేమొ.

ఉ—(కన్నులనీరునించుచు) కలలు నిజమగునా! నాధునొంటిరిగ తన్కరబ్బందము ద్రుంచెన చాలవిచారముగానున్నది. (అటునిటుపొర్లుటజూచి) నాథా! నిద్రపట్టుటలేదా?

అభి—సతీ! చల్లనిగాలిలేనియెడ విశ్రాంతికల్గునా? నీవేదియో మనంబుననిడి నాసేవమానితివి.

ఉ—నాథా! యేమియులేదు (అని విసరబోవ)

అభి—వనితా! వలదు నీమనంబేదియో చింతదగుల నాకెఱుంగరాని చింతల యన్యోన్య హృదిస్థరహస్య దంపతీ మనోవైకల్యమగు చింతలగల్గ నీకంచిగరుడసేవయేల. వలదు నీవనొసరంబుగ శ్రమజెందవలదు.

ఉ—నాథా! నాపై కోపమువచ్చినదా?

అభి—లేలా! కోపమేలనే. నీకెఱుంగరాని రహస్యములు నాకుండిన లేకపోయినను నాకగోచర రహస్యములు నీచెంతగలవు. నాకుం జెప్ప వెరచుచుంటివి. బలవంతముగ నీరహస్యముల నెఱుంగ నాకేల.

ఉ—శరీరంబులువేఱైన మనంబులేకమైన నన్నిట్లు మాటల పీడింప న్యాయమా.

అభి—ఆమాటనే నేచెప్పవలయునుకదా!

ఉ—నాకేమిరహస్యములు లేవు.

అ—అవును నాకు తెలియజేయు రహస్యములు లేవని నీవు వేఱుగచె
ప్పవలయునా! నేనెఱుంగుదును.

ఉ—నాపై మీకీయనుమానమేల కల్గవలె.

అ—అనుమానమేమున్నది.

ఉ—లేనియెడ నీవాదమేల.

అ—రహస్యము నీకుగలదనువిషయ మనుమానముగాదు సత్యమే.

ఉ—ప్రియము సత్యమునగువాక్యములే మాబోంట్లు పలుకవలయు.
నాగుట్టువెలిబుచ్చిన మీకుంబ్రియముగా నేరదు.

అ—దాని నేవినగోరుచున్నాడ.

ఉ—నాథా! నిన్నరాత్రి

అ—ఆరహస్యము నేనెఱుంగుదు. కాని నీవుధైర్యము కల్గియుండుము.
(సుభద్ర రోయుచు ప్రవేశించును.

అభి—అమ్మా ఈసంభ్రమం బేమి

సుభ—నాయన యేమున్నది. పాడన పుంగవుంను కౌరవమూకకా కృ
ష్టుండగునట.

అభి—అమ్మా నీకెవ్వరు చెప్పిరి. నీవుపౌరబాలుర వింటివేమొ. నీకు
ధర్మజాగ్రపైగ్లు భక్తియు ప్రేమయు సందేహ మాపదించియుం
ను.ను

సుభ—కాదు బాలకా అది నమ్మదగిన మాటలే.

అభి—అట్టులనా. ద్రోణ.

చం॥ వనము దివాకరాగ్ని సమ। బాడబకీలల పొట్టనుంచుటల్
వనదము వాయుసంతతుల! బారగద్రోలుట వహ్నికీలలఁ

మనమున భీతివీడి శల । భంబుపిజోదరమందు నిల్పుటల్
మనుజపతిక్ యుధిష్ఠురు న । మర్పణజేయుట తుల్యమౌఖలా.

మఱియు

ఉ॥ భీమగదాభి ఘాతములు । వెన్కకు జంకెనొ వీర పార్థ సం
గ్రామ కళాధురంధర శ । రంబులుమాసెనొ మాద్రి సూనవీ
రామితవాజికౌశలము । హైన్యముజెందెనొ క్రీడి పుత్రితే
జోమరకీర్తి చంద్రికకు । నంతముగల్గెనొ ద్రోణుడిట్లనక్

ఉ—ఆమహాత్మునకు గెలుపుగల్గుట విచారహేతువే?

అభి—బేలా నీవుకూడ విచారమందెదవేమి నూయమ్మ వినునది పౌర బాటగును.

సుభ—నే వినినది పౌరబాటుకాదు. చారులు పల్కినారు

అభి—ఏమని

సుభ్రి—చం॥ శరశిలశాయిభీష్ముడిక । సైన్యమునేడికొసంగనోసురా
సుర జయశక్తిశాలి ద్రోణుడవి । శుద్ధచరిత్రుడు పార్థగర్వముల్
విరులతెఱంగు ద్రుంపు రిపు । భీకర కర్ణుడు నేరికిన్తు భీ
కర విషయంబు గాన రిపు । కొందు వానికొసంగు దంచనక్

ద్రోణుండు గృహీతసేనానాయకుండై యున్న రణంబున కౌరవనాధునకు దృష్టిజేయుడేమి పద్మవ్యూహముబన్నినా కరడిద్రి. ట్టదలంచె?

అభి—పద్మవ్యూహంబు నుచ్ఛేదించు నా తండ్రి లేడా!

సుభ్రి—కల్గిన విచారమేల. కౌరవ ప్రోత్సాహితుండై త్రిగర్త నృపతిసు శర్మ నీతండ్రి నాలంబునకు బిల్చె.

అభి—భీముడు లేడా.

సుభ—తక్కినవారుగల్గినను లేనివారే. వారికి పద్మవ్యూహము భేదించు తెఱుంగరాదు. అదియుగాక ద్రోణుడు శరవర్షంబు గురిపించుచుండ మనవారు.

సీ॥ ద్రోణబాణంబుల ♦ దులయూకిరీటి శ
రములున్న బాగు చ ♦ లంబునిలుచు
యేకడనున్నాడో ♦ యేగైనపోయి మా
దుస్థితినెరిగించి ♦ దోడితెండు
పద్మదూపవ్యూహ ♦ భారంబుదొలిగింప
శక్తినేరికిగల్గు ♦ శర్వజేత
సుతునికో వానికో ♦ యతులవిక్రమరణ
కోవిదహానన ♦ కుపతిగణుడు
ద్రోణునకెరుంగ నౌగాక ♦ రోషరక్త
నయనతీవ్రశరాసన ♦ పరిసుభ ప్ర
ఖండితాఖిలశీర్షుడు ♦ గదనుగాల్చు
భీమునకులాదిపాండవ ♦ వీరులలుగ
లెక్కయే ద్రోణనయనాగ్ని ♦ వీలకీలను.

అనిపల్కుచు రణోన్ముఖులైరి.

అభి—అమ్మా! నాకునమ్మకము లేదు. అజాతశత్రుండజాతభయుండు కదా?

సుభ—వత్సా! ధర్మజుండు సోదరయుతుండై ద్రోణునెదుర్కొనబయల్దేర ద్రోణుండు నీపెదతండ్రికి మాటనిచ్చు తెఱంగున కొంచముతోఁ ద్రవనిచ్చి వారు లోనౌరగానె యయనముబంధించె.

అభి—కపటస్వభావా! పాటా!

శా॥ పద్మవ్యూహమెరుంగనట్టి పితలు౯ । బంధించి గర్వంబుచే
పద్మారాతికులోద్భవు౯ ఖలునిసం । భాతింపగా గోరితే
పద్మవ్యూహముద్రుంచిద్రోణుసహితు౯ । పార్థున్ సురుల్ లోకముల్
పద్మారాతికులాబ్ధి చంద్రుడనినన్ । భావింప దేకుందునే.

(తెరలో) ప్రతిహారీ! సుభద్రేకడనున్నది. ఏమనుచుంటివి. యభిమన్య

వీరక్షత్రియ వంశంబున బుట్టి. కదనరంగంబునందున పరాభవంబు జెందుటయా? ధర్మరాజ శృఖలంబే లేనియెడల పాంచాలీ రేణుక కౌరవవంశ కమలాకరంబు నున్మూలింపదే!

అభి—తల్లీ! యేటికీపల్కులు. అభిమన్యుకుమారుడు సప్రాణుడై యుండ వీరవనితలు యుధిష్ఠిరమోచనార్థమై రణోన్ముఖులైరన్న శిరచ్ఛేదముకాక వేఱేమున్నది. గాయము మానిపోయినది.

ద్రౌ—బిడ్డా! రోగివౌనీకు రణంబేల. కుదిరి ద్రోణ వాయుపాంచాలిగల్గ నీకుశ్రమయేల.

అభి—అమ్మా!

చం॥ రణమున క్రీడిసూతిరిపు । రక్తముగ్రోలెద ద్రోణగర్వముర్
నణగగజేయుఖడ్గమరి । నాశనకారి యధేచ్ఛమెగ్గి ధీ
మనమునసేమబొందు కురు । పాండవకీర్తుల దేలుగాన నే
రణమునమెల్ల నాజ్ఞనిడు । రాజసగౌరవ ముంచుమాతరో.

ద్రౌ—శూరునకు రణంబేదొరకదా? ఇట్టి భయంకర సమయంబున నాత్మహానికరంబగు పనులమెలంగనేల.

అభి—అమ్మా!

సీ॥ నీవేణిముట్టిన ♦ నీచులదండింప
సమయంబుదొరికెను ♦ సంగరమున
పినతండ్రివిషమున ♦ మృతిజేయయత్నించు
ఖలురజంపగవీలు ♦ కదనభూమి
మాయజూదంబున ♦ మానైభవములాగి
కట్టుగుడ్డలబంపు ♦ కఠినహృదయ
మదముత్రుంపగనేను ♦ పర్వదినంబు
క్షమియించి పన్నమము ♦ కౌరవేంద్రు
రుధిరపానకాంక్ష సింహ ♦ రోషయుతుని

గీ॥ వారణము జేయభావ్యమే । పంపుతల్లి
క్రీడిబాణంబులేకావు । క్రీడిసుతుని
కోపమైనను జాలును । గూల్పమనల
ననుచు తెల్పును వారికి । నతులశక్తి.

ద్రౌ—కాని నాహృదయ మేటికో శంకించుచున్నది. దుష్టుల సమయిం చుటకు నీవు పోవలదు.

అభి—అమ్మా నీవీవిషయముతో పట్టుబట్టవలదు. నాహృదయంబు రణోర్వికి పర్విడుచున్నది. తల్లిమాట తృణీకరించెన నపఖ్యాతి మాత్రము నాశిరంబున నిల్పకుము.

సుభ—అక్కా! నీకీచింత యేల పోయి రణంబున తండ్రి రక్షించును.

ద్రౌ—నీకు బిడ్డపై ప్రేమ లేదా!

అభి—యున్నదికనుక నే నన్ను కీర్తికాయు జేయయత్నించుచున్నది.

సుభ—అక్కా మన యుత్తగారేమి తనసుతులకు వర్తమానమంపినది.

చ॥ ఖలులయి సంపదల్ గొని య । గౌరవమార్గముబట్టి చంపగా
బలుయతనంబులన్ జనిం । వైరులు కృష్ణకటాక్షమునంటల్
చలమున దాటివచ్చితిరి । సంగరమబ్బెను జీవవాంఛచే
వలదు యశంబువీడ యను । నాటికిపంపుడు లేక పోవుడీ॥

కావున నాసుతున కదియే వర్తమానము.

ద్రౌ—నాకుమాత్రము మనంబొప్పుటలేదు.

అభి—తల్లీ నాకనుజ్ఞ నీయవా!

ద్రౌ—ణాగ్నేయ శరంబుల్ నాసమీపంబున శీతలబిందువులౌను కాన నాకు శలవొసంగుము నీశిరఃకంపనమే ద్రోణగర్వంబు నిర్మూ లించు రక్షణీయ పితృవ్య రక్షణంబగును నీ నెత్తిపై కాదు కాదు నీశిరఃకంపనంబుపై పాండవులకు లభ్యమగునది స్వరా జ్యంబో పొడవస్వరాజ్యంబో స్థిరంబగు. నీవాజ్ఞనొసంగకున్నయు

ధిష్ఠిదుష్క్రూరులు దున్నైదరు దాన సర్వనాశంబగు వారితో నేడైన మృతింజెంద తక్కుంగలవారు కూడ కాయంబులవీడ కృతనిశ్చయులు కారే.

ద్రౌ—సరిదేమే వెళ్లుము. (అని యిద్దరు నిష్క్రమింతురు.)

ఉ—నాథా నాదొక మనవి.

అ—అయ్యాదెద్దియో నేనెఱుంగుదును కాని నేనోర్వజాలనందులకు జాలవిచారించుచుంటిని.

ఉ—ఏమియట్లనుచుంటిరి.

అ—తల్లియాజ్ఞ లేమిచే నెనెరుగుటకే బహుప్రయాసల జెంది యనుజ్ఞ బొందితిని కాన నే యుద్ధంబునకేగెదను. నీవు మాజనని వద్దకు పొమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)





ఓమ్.

# పద్మవ్యూహము.



## చతుర్థాంకము.

-:o:-

### ప్రథమరంగము.

ప్రవేశము—సంజయుడు.

సంజ—ఆహా! ద్రోణుడా పద్మవ్యూహము నెంతజాగ్రతతో బన్నినాడోగదా! పిపీలికంబేనియు నందుజొరగ నశక్యంబు (అటునిటు దృష్టినిగిడించి) ఏమది! సుమిత్రుండు సారథ్యముం గొనియుండ నభిమన్యుండు చంచలచందంబున చంచలుండై గురునిండీకొనుచు పద్మవ్యూహభేదన కార్యాసక్తుండై పోవుచున్నాడు. ఆహాహా! కుఱ్ఱడయ్యు నింతజంకులేక వేవేల రణంబులంబోరిన ద్రోణాచార్యు నాతఁడా డీకొనుట! (మరల పరికించి)

గీ॥ ప్రళయరుద్రునిబోలి తత్పద్మముఖము
నందుభీకరరూపుడై నట్టిద్రోణు
చిత్రభీకర శస్త్రాగ్ని చేనడల్చి
పద్మముఖమును జించెడిపార్థసుతుడు॥

అబ్బా! ఈతనిమహిమ మెంత శ్లాఘనీయము! ఏమది! ద్రోణుడట్టె నిలచియున్నవాడు. అభిమన్యుని శరవేగంబును సైరింపజాలకయే అల్లదే తలనెత్తినమాత్రాననే తాళఫలంబుల విధంబున త్రుటి

కాలంబుననే యనేకశీర్షంబులు నేలగూలుటయు గుంభసంభవుండు నిమిషనిమిషమును విపత్తుం గాంచుచుంటకే తన సామర్థ్యమును సర్వమును ధారవోయుచున్నాడు. అదిగో! అభిమన్యుడు లోనికిజొచ్చినాడే! ఈతడెంతకేనియు సమర్థుడే! కాని పై నేమి యొనర్చునో జూచెదను. (నిష్క్రమించును)

2వ రంగము.

[ప్రవేశము—ధర్మరాజు, దుర్యోధనుడు.]

యుధిష్ఠిరమహారాజా!

గీ॥ అఖిలబ్రహ్మాండ భాండంబులైన జించి
దిగ్విజయమును గాంచెడువీరుగల్గు
సోదరులునల్వురుండగా జోద్యముగను
నేడుదుర్యోధనుని చేతబడితివేల?॥

మఱియు

ఉ॥ చిక్కినమాట నిక్కమము। చిక్కనయంతతో బోదు
దిక్కన నేయనెంచెడి। మతిక్ ఘటియిల్లెడు దుష్ఫలంబు నా
చిక్కినవాడ వీనెటులనే సెదవో। వచియింపు మింతకున్
దక్కునె? నీదు ప్రాణములు। ధర్మజ! నేటితో వీడుజీవముల్॥

ధర్మ—ఓరీ! దుర్యోధనా! నీకుజిక్కి చచ్చెదననుమాట యసత్యము.

సీ॥ కామోదకీ * తీవ్ర భీమగదాహతి
కౌరవేశ్వర! నిన్ను * గాల్చునెడ
శార్ఙ్గసదృశమైన * చాపకాన్వితుడింద్ర
సూతిసింగాల్పంగ * జూచునెడల
* నందకమ్మునుమించు * నట్టి తీవ్రాసిచే
కలువలు నిన్ను * మిత్రంగగదలంప
బ్రహ్మాండభాండంబు * భస్మీకృతంబుగా
నలుప గ్రీడిసుతుండు * చెలగునెడల

గీ॥ ఇటుల ధర్మజుఁబట్టి * నీవేమి సేయ
గలవుని ఇంతకు * నీకుఁతత్కాలికముగ
దొరకినంతనె యిట్లు * మదోద్ధతిగని
యొడలుమఱిక * వదరుచునుంటివీవు॥

ఉ॥ దిక్కుల సజ్జయంబుగొను । ధీరులు నాదగుతమ్ములుండ్రి, నన్
జక్కఁగ గాచుచుండ భప । సాయకవహ్నికి జిక్కనేర్తు నే
దక్కెనె తత్ఫలంబులు । వృధాగద నీశ్రమయెల్ల నింతకున్
జిక్కిననన్ను నీవిచట । జేసెడిదేమిటొ? జూపుమియ్యెడన్॥

మ॥ రణరంగంబున శాత్రవాళిదునుమన్ రంజిల్లి నన్బట్టి తె।
చ్చినవాఁడేనియు నిట్లు గర్వముల వంచింపఁగనోపండు; ద్రో।
ణునిపాదంబులఁబట్టి వేఁడుకొని నన్నుంబట్టి తెప్పించియు।
ట్లొనరింపన్ త్రపయింతయేనిగనవే! లోకంబు నిన్మెచ్చునే?॥

ఉ, తనకెగ్గుల్ బొనరించు పక్షముని భర్తంజేరి ప్రార్థించి య
న్యునిదండింపఁగ జేయు చందమున నీవు న్నన్ను బట్టంగ ద్రో
ణుని ప్రార్థించితివే; మికార్యమిది? మాన్యుల్ మెచ్చు చందాన నీ
వననుంబట్టిన భావ్యమౌ; పరునిచే బట్టింప స్త్రీకృత్యమౌ.

దుర్యో—అగునగును నీవు కడపటివారి చెప్పినదానికి ప్రత్యుత్తరము నీవనినదానిలోననే యున్నది. నలువురుసోదరులు నన్ను గాపాడుచుండ నీవేమియొనర్పగలవని యూ యడుగుచున్నావు. యంతియేగాని నిజదోర్బలంబును నమ్మికాదుగదా! ఇట్టి భీరువును రారాజు బట్టుట యనర్హకృత్యమని పరులచే బట్టించితిని.

ఉ. సింగము నీచజంతువులఁజించుచు జెండెడి రీతి మేమునుం
సంగరరంగమందుఱికి శాత్రవ వర్గము శేషమౌ గతిన్
భంగముగూర్చుటొప్పెడి; ననర్హుల మిమ్ములఁబట్ట కీర్తికిం
భంగముగల్గుమాకు; ననపాయతఁగూర్చుచు వీడుటే తగున్.

మద్భుజాబలంబు జూపుటకు చితకాలస్థానంబులున్నయవి అత్తరిన
నవార్యుండై సుయోధనుండు.

ఉ॥ సారథి కృష్ణుడై తనర శక్రసుతుండు రణంబు జొచ్చి "య
న్నారణమాచరింప చనంగదె యో! కురువంశభూపతీ
ధీరతయొప్ప" నన్నపుడె తెల్లమ్ముగాదొకో మద్బలంబుగం
భీరమృగేంద్రుడెల్లపుడు మృక్కటులన్ విడి దంతిజంపెడిన్.

పక్షాంతరమున

చ. పెనుగడనూని భీముడు సవిస్తరభూబల మండలుండు "పో
రున కరుదెమ్ము లెమ్మ" నిపులోమజ సూతికి మారుబిల్చినన్
ఘనమగు మద్భుజాబలము కన్పడగా దువు బూనివాని శో
భవమొనరించి భీమునకు చూడ్కిని గుప్పుట విభ్రమింపగన్.

ధర్మ—అగునగు నీవు చెప్పినదంతయు నిక్కమే! యుత్తరునకు సోద
రుడవగుట కావంతయు సందియము లేదు.

ఉ. గోగ్రహణమ్మునాడు తమకుంగలసాయక యోగమున్ మహా
నిగ్రహముంగనంబడగ నేర్చిన గోవుల దెచ్చుకొంటివే?
ఉగ్రతమాస్త్రకీలల ప్రయోగము నేటికి నేర్చుకొంటివే?
సీ! గ్రహియింపరే? ఎవరి చేతలవెంతవు చెప్ప నేటికిన్.

మరియు నింత బలాఢ్యుడవగుటచేత నేగాబోలు.

మ. గంధర్వుల్ గల తానమున్ జనుచు లెక్కల్ సేయకే వారినిం
బంధింపం దన కేళి మందిరము శుంభల్లీల గంధర్వులున్
బంధీభూతుని జేసి తోడ్కొనగ మాపార్థుండు గాదొక్కొ ని
ర్బంధుం జేసిడి నిన్ను గర్వవచనోల్లాపంబు లింకేటికో.

చ. ద్రుపదుని బట్టి తెత్తునని తెంపును బెంపు వహించి నీవు పో
యి ఫలముపొందనేరమి మహీసురు సన్నిధి జేర నల్లరుం

ద్రుపదహీనుండవ బార్థుఁడెగదా! ద్రుపదుంగొని దెచ్చి యిచ్చె; దం
భపువచనంబు లేటికి? ప్రభావమునీయది జ్ఞాతమేగదా!.

కావున కీర్తికిన్ని వెదుకొ్ని జయంబు నొందుదవనుట నిష్ఫలము.
ఇకగదా యుద్ధమున భీమసేనుని డీకొనుటయా!

చ. "గదకయిగొంచు నాలమున గౌరవనాథుని డీకొనంగ ని
ల్లిదె పవనాత్మజుం డరుగుదెమ్ము, ధరాభర మిప్పు డీల్గునం"
డువితరుపాతిరేకమున నుగ్రతబూనుచు భీముఁడొప్పఁబో
రెదె! విజయంబుజెందుటకు? లేశము సందియమున్నె చావగా.

చ. గురుని ప్రదర్శనంబున నకుంఠితబాహుబలంబు జూపగా
నరసిప్రజాళి మెచ్చుచు "మహాబలుడీతడటంచు శ్లాఘముం
జరుపగనీను జెంది నిజసత్వముజూపగ బోయినట్టి యుత్తరి
తిరమువ్యోనే? నస్మళదర్పము జూపగ నేమ నంతయూ.

(తెరలో)

ఓరోరీ! యేమి రాగర్వము! రారాజు నిట్లు తూలనాడుచున్నావు.

గీ. సోదరశతంబు కాపాడుచుండ నీవు
నానర గర్వోక్తులం బేలుచుంటి వౌర!
ఇతడు రారాజటంచు నీ వెఱుగవొక్కొ
నింతకును జేటుమూడె ధర్మేశతనయ!.

(దుర్యోధనధర్మరాజులు వింటురు పై పద్యమును జదువుచు దుశ్శాసనుడు ప్రవేశించి)

ఓరోరీ! యేమిరా! కండకావరము. దుర్యోధనమహారాజునా తిరస్కరించుచుంటివి? (సుయోధనునిజూచి)

అన్నగారూ! మీరింకను యూఱకుంటిరేల?

దుర్యో—వంటయింటికిం దేలది యెందుబోగలదని యూఱకుంటిని. (ధర్మజునిజూచి) ఓదండధరపుత్రా! ఇంక నీజీములపై నాశవీడుకొనుము.

దుశ్శా—

గీ. ప్రభుపదములుబట్టి సంప్రార్థనంబు
జేసి కృపగొన్న నిన్ను గతాసుజేయు
కుందు నింతేని బీరంబులందువేని
నిక్కముగనీదు ప్రాణము ల్దక్కవింక.

ధర్మ—ఛీ! ప్రాణముల్కై విరోధిని వేడుకొనుటయా!

ఉ. పుట్టిన పూరుషుండు పరిపూర్ణముగా బ్రదుకంగబోడు; రేపొ
పట్టుననైన జచ్చుట నివార్యముగావున వీని పాదముల్
బట్టుచు జీవమొందుః మనులాగతి హేయము నెట్టిజెట్టలం
గిట్టగ సేయకుండ జనునే! కురువంశముజొచ్చినందుకై.

(తెరలో కలకలము.)

(అందరు విస్మయముతో నాలకించెదరు.)

(తెరలో)

దుశ్శా—మహారాజా! యిటుజూడుడు.

ఆ. వె. సింహగర్జనంబుచే భీతిగనువేళ్ళ
మాడ్కి కురుపతి దళము దరిపోయె
కానవేగనరిగి కావంగవలెవారి
కూతయొసగిపోరు కోర్కెతనర.

(దుశ్శాసనుడు నిష్క్రమించును.)

దుర్యో—

మ. నిజకోదండము బాహుభూషణముగా నిర్మించుచుం గౌరవ
వ్రజమున్ దూలగ నేయుచుం మరల నీవంకన్ద్వరన్ వచ్చి వీ
రజనాళిన్ భయమందఁబోరెడిని సంగ్రామైకరాముండుగా
గజయుంబుంగొనజాలమదగ్ని కడ; వీరన్ వీరుడెవ్వాడొకో.

ఉ॥ ఇంతటిశూరుడెవ్వడు? మరెవ్వడు పార్థసుతుండుగాక? నా
స్వాంతము చేయివట్టి యభిమన్యుడుగాక మరొక్కడెట్లు
వంతల గూర్పగాగలడు; పార్థునకుందగు పుత్త్రుడీతడే;
శాంతనవాదిశూరుల కసాధ్యగతిన్ పయి విక్రమించెశిన్॥

(తెరలో)

ఓరోరీ! సైనికులారా! మీతో నాకు బనిలేదు. మీ ప్రాణములను మీరు రక్షించుకొండు పొండు. కాని మా పెద్దయ్యగారిని బంధీకృతునిగ చేసిన దురాత్ముండగు దుర్యోధనుం డెచ్చటనున్నవాడో? నే నచటికి బోవలయు

శా॥ ఓరీ! కౌరవనాయకా! శకుని! యోహో! దుస్ససేనాంగరా
జా! రాధాసుత! మీదుప్రాణముల ద్రవేచక వచ్చుచున్నాడిదే
ధీరత్వంబున పార్థసూతి యిము సందిగ్ధస్థితిం బెట్టి ,,హో
రారాజా!'' యనిగెటి ప్రోక్కగతి వీర్యంబిష్ట చూపింపగా॥

దుర్యో—ఆతడభిమన్యుడే! ధర్మరాజుని బట్టినందుల కుగ్రుండై యిటకే వచ్చుచున్నాడు. ఈతని కుపశాంతి సేయుటెట్లో ఈతని హస్తము గాయములచే నిండియుండుటచే స్వస్థత లేదని చారులు విన్నవించిరిగదా! అది యసత్యముకానోపు. అయ్యది సత్యమేయయిన పెదతండ్రిని బట్టిరనునంత బుట్టిన క్రోధమీతనికి నోడలినెటింగింపక విజృంభింపజేయుచున్నది.

[కర్ణుడాతురతతో ప్రవేశించి]

శా॥ రారాజా! నిను గ్రీడిసూతి సమరారంభంబునం దుగ్రుడై
పోరంజాలియు హస్తగాయములచే బోరంగ లేడంచు నీ
చారుల్ జెప్పుటకల్ల; వాడు కురువంశచ్ఛేద నోద్దాత్తుమై
ప్రారంభించెడి నొక్కదిక్కునదె! యేపారన్ కురుక్ష్మాపతీ॥

ఉ॥ అంతటితోడ శాంతిగొనకాపడు నీదరి కేగుదెంచి నిన్
ద్రుంతునటంచు బల్కెను; మదోద్ధతినయ్యది యాలకించి నే

గొంతగవాని బోరితిని! కోపముతగ్గదు; మెట్టులేని నే।
వింతును నిన్నటించిటుల వేగిరమే యరుదెంచితిన్; సఖా!॥

శా॥ నాతోడన్ సమరంబుసేసి యటుపై నన్వానితో బోరుమం।
చేతత్కార్య ధురంధరుండనయి యెంతేవానినిం డీకొనం।
గాతోరంబిటు లేగుదెంచునరి వీక్షా వాని డీకొన్న నే।
«నీతో బోరగగాను; కౌరవచమూనేతన్ గనంబోయిత।
‹ద్వాతంబుల్ దిలకింపనూహ్చదను; మత్త్పావీణ్య మొప్పారగా»॥

చ॥ అని బహుభంగులంబలుకు నాతని డీకొనునంత నన్ను నీ।
ల్గ నొనరుపం గలాడుగను కయ్యెడ నిల్వక బోవునంత యొ।
క్కనిగనుగొక డీకొనిన కారణబుం గణియింప కెంతయుం।
జనె; జననాథు సన్నిధికి సాహసమొప్పన వారితక్రియన్॥

ఇంకను యభిమన్యుండు రాలేదా? పేమెందర మెన్నిభంగుల నాతనినె దుర్కొనినను యాత్మరక్షణ జేసికొనుచు నీకై పడి వచ్చుచున్నాడు. మార్గమధ్యమున నేకతంబున నాపన్యమొనర్చెనో! కావున నీ వుజాగ రూకుండవై ధర్మజుం గొనిపోయి యతనికంట బడకుండ పొమ్ము. లేదే ని నిప్పటికే యనలంబు ద్రొక్కిన మర్కటంబును బోలి జెలరేగు యాతని రౌద్రము ధర్మజుని జూచినపుడు వేఱుగా జెప్పబనిలేదు కావు న సత్వరము బొమ్ము.

(నిష్క్రమింతురు)

---

ద్వితీయరంగము

ప్రవేశము—సంజయ వైశంపాయనులు.

వైశం—సంజయా! చూచితివా యభిమన్యుడు కుఱ్ఱవాడయ్యు బద్మ వ్యూహమును జించుకొని లోనికి జొరబడి కౌరవులనెల్లర నెట్లు నూటాడుచున్నాడో!

సంజ—అందుకు సందేహమేమి?

సీ॥ గరళకంఠునిగెల్చి గాండీవమునుగొన్న
కవ్వడి యాతని గన్నతండ్రి
పవనాత్మజుడు గదా పాతంబుచే కీర్తి
గొన్న భీముడువాని పిన్నతండ్రి
ఐరావతము మించు నట్టి యశ్వంబుల
ఖ్యాతిగొన్నట్టి యా కలువలలర
ప్రాణాంతకముగా నబద్ధమునాడని
ధర్మజు డల పెద తండ్రిగాగ

గీ॥ సఖల సిరులను నాటప ట్టయినయట్టి
వీరరక్తంబు కాయాన బాఱుచుండ
నరులసించి చెండాడె నన ఖ్యాతిగలడె
బాలుడైనను రిపుపాలి కాలుబగుచు

మఱియు

మ॥ తమకుందల్గిన చేటుగన్గొనుచు చింతాక్రాంతులై ద్రోణక।
ర్ణ మహావీరులు భీతినొందంబు ఉద్గారీధవ్రాద్రేకమున్గ
క్షమ యొక్కింతయు లేక బోరు యభిమన్యాఖ్యుణ్ వడింగూల్పగా।
తమసామర్థ్యము సర్వమున్ బనుచు నేతద్వీరులడ గంటివే॥

వైశం—ఔను. నీవనునది సత్యమే. అయ్యభిమన్యుని జూడుము.

ఆ॥వె॥ ఇంతదనుక తండ్రులే బోరుచుండ్రి
తనకు సమయ మబ్బదనెడు చింత
తొలగ నేటికనగ విలస దాస్యంబున
సమరహర్ష కళల జాటుగొనియె॥

అంతియగాక

శా॥ బాలుండీత డదేమి సేయగలడన్ ప్రాగల్భ్యముల్ బల్కు తద్వా
చాలాగ్రణి కర్ణుపాలి యముడై వర్తిల్లు నబ్బాలకుం
డేలా యాలములోన వైరిపరులన్ హీనాతి హీనక్రియన్।
జాలంజీల్చగ నేరడాతని రణోన్మాదంబు సామాన్యమే!॥
సీ॥ కౌమరుమిరాంగ గయి గాదండమున్ బూని
దక్షిణ హస్తంబు తనరుచుండ
కటితలమున నుండి ఖడ్గంబు వ్రేలాడ
రత్న ఖచితమై రాజిలంగ
అగ్రభాగంబునం దాసీనుడౌ సుమి
త్రుడు స్యందనంబును వడిగదోల
సమర సంరంభ సంజాత హర్షాతి శ
యంబు కేలూతగా నలరుచుండ
గీ॥ పయిపయి నరాతి వర్గంబుపయిన దుమికి
సింగముల బొబ్బరింత హసించునట్టి
భీషణా రావములతోడ భీతిగులుపు
నట్టి యభిమన్యుముం దెవ్వ డాగగలడు?॥
సంజ—వైశంపాయనా! మనకు శత్రువర్గములోని వాడగు నీ యభిమ
న్యుని నింతగా బొగడుచుంటి వేల?
వైశం — సంజయా: ఇందు పొగడ్త యేమున్నది? నేను వచించుచున్న
దంతయు సత్యము. మనలో మనము సంభాషించు చున్నపుడు
శక్తి యున్నవారిని పొగడుకొందుమా? సత్యంబునకు స్వపక్ష
పరపక్షంబు లుండునా?
సంజ — ఏమిది? యటుజూడుము. భీష్మ యుద్ధమును మించుచున్నదే?
ఉ॥ వైరిమదేభ బృందమున వారిత లీలల నుక్కడించి వ।
హ్వా! రిపుశీర్ష తాళఫలమ్ముల దె యొక్కటిగా ధరాస్థలిం।

గూలెడి; భానుమండలము గొప్పగ ధూమము గప్పజొచ్చెనే
వ్వారు రణంబు సేసిరిటు? పార్థకుమారుడు దక్క వేఱొరుల్॥

చ॥ అరదచయంబు గూలె గద! యాహవమందు ధురీణులెందరున్
బరివిడ జొచ్చిరయ్య దియ పార్థకుమారుడు విక్రమక్రమ
స్థిరతర ధైర్యమూని రిపుచేతం ఝల్లని తల్లడిల్లగన్।
సరి! జయవాంచనున్న! కురువంశ మహేశునకిట్టి యుద్ధముల్॥

వైశం—అగునగును. నీవు చెప్పినదంతయు నిక్కువము

ఉ॥ దిక్కులు పిక్కటిల్ల రణధీరులు పీనుగు పెంటలౌ గతిన్
మ్రుక్కడి వారి గ్రక్కొనక నీయభిమన్యుడు బోరె యోధులన్।
"ఎక్కడివాడో! క్రీడి సుతుడింతటి వాడొకొ" యంచు వీరులి
ప్పక్కి నుతింప పోరెడిని పార్థకుమారుడు సార్థకాఖ్యుడై॥

(తెరలో)

ఉ॥ కౌరవ జాంఘికాళి! యిటుగా బరువెత్తెద రేల? తుచ్ఛశా
రీర సుఖంబు గోరుచు గడింపరె శాశ్వతమైన కీర్తి; న
ద్వీరున కొక్కచావు; పదివేల మృతుల్ గద పందకెందు; వి
స్తార సమార్జితంబగు యశంబును గాచికొనుండు పోరుచున్॥

వంజ—అదిగో! ద్రోణుని మాటలువిని మరల కౌరవసేన ధైర్యము
దెచ్చుకొని పోరాడుచున్నయది.

వైశం—భారద్వాజుడును దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులును నేక
మై యొక్కతరి వానిం డీకొనుచున్నారు. ఇదిగో! యభిమన్యుడే
దియో యనుచున్నాడు.

(తెరలో)

ఉ॥ ధర్మజు బట్టిరేమిటికొ! దండధర ప్రభవుం గణింపుడు
ష్కర్మము కాలిపోయెగద! కౌరవనాథ! సుయోధనా! మిమున్।

బేర్మినధించి పాండవుల పేర్మినిగూర్చెద సాయకాగ్నిచే।
శర్మదుర్గమైన క్రీడిసుతు శక్యముగాదని మీఁ రెఱిచిరే!॥

సంజ — నీవంతటి వాఁడవే యగుదువు.

(తెరలో)

మ॥ సమరస్థానస్థలి వీనివీక కురువంశప్రోద్భవుం బట్టి భీ।
ష్మ మహాస్త్రంబుల గూల్పకుండునొకో; భీష్ముం డంతరింపంగ చూ।
డమె! వానింబలె బోరువానిగను చండాస్త్ర ప్రయోగోద్ధతి।
క్రమ సంయుక్తుని పార్థసూతుని రిపుక్ష్మాభర్తలం ద్రుంపగా॥

ఉ॥ కావున నెల్లవారలును గైదువులంగొని సిద్ధమౌచు మీ।
లావును జూపరండు సమరస్థలి వీనినిద్రుంప నేర్చుచో।
నా విజయుండు ప్రాణముల నాసవిడుంబవ నాత్మజుండునుం।
శ్రీవిభుతోడ బాండవుల శేషముగానిది హేతువౌ గదా!

ఉ॥ బాలుడటంచు నీ బుడుతఁపాటి యొనర్పమయేని యీతడే।
కాలుడుగాఁగ పర్వెడిసి కౌరవసేనల పట్లనిట్టె దు।
ర్వారభుజా బలాన్వితువి లావుగణింపక నూఱకొన్న యీ।
కౌరవ వసిశచ్ఛేదనకు కారణమౌ యభిమన్యుడౌ గదా!॥

వైశం — ద్రోణుడింత యుద్రేకమును బూని వీనిపైకి వచ్చుచున్నాఁడు.
యిక నీతఁడు చచ్చుట నిశ్చయము.

సంజ — యేమిరా! యేదియెట్లు గానున్నదో యెవ్వఁడెఱుగును?

వైశం — యేమి? యాశ్చర్యము! ఇంతమంది చుట్టుముట్టినను నందరికి
నన్నిదిశల సమాధాన మిచ్చుచున్నాఁడు.

(తెరలో)

ఓరోరీ! క్రూరులారా!

గీ॥ ధర్మకంకణము, గుడి హస్తమునకు నిడి।
గాయముల చేత కటను కంకణముల।

వాముహ_స్తంబు నందిడి పరగునన్ను!
నాదు ధర్మంబె రక్షించు మీాదమీాద॥

సంజ— గీ॥ యజ్ఞమృగమును దరుము పినాకివోలె!
శక్ర సుతజుడు నిపుడు దుశ్శాసనుని త।
రుముచు వెనువెంట బోవుచు భీమమూ_ర్తి!
దాల్చి భీతిని గొల్పుచు దనరుచుండె॥

(అవనికజారును)

## తృతీయరంగము

[ప్రవేశము—దుశ్శాసనుడు.]

దుశ్శా—(పరుగున ప్రవేశించి) అమ్మ! ఇప్పటికి ప్రాణములు కుదుట పడినవి.

అభి—[ప్రవేశించి] ఆc! కుదుటపడినవా? (యని రొమ్మపై గూర్చొని) ఓరీ! పాతకీ! దుశ్శాసన!

గీ॥ పౌరవాన్వయ జాత ద్రౌపతి పశువ!
ప్రాణ బల దీయకుందువే? భండనమున!
నాడు ద్రౌపది కొప్పంటి నట్టిఫలము!
నేడు గుడిచెదు; తృ_ప్తిగా వీడకునికి॥

(అని మొలలోని క_త్తిదీసి నాలుక గోయనెంచును.)

దుశ్శా—ఓ పాండవ ప్రదీపకా! నన్ను జంపకుము. శరణు! శరణు! శరణాగతుల జంపరాదు.

అభి—ఓరీ! భూభారంబు దీర నిన్నిప్పుడే హతమార్చెదను.

(తెరలో)

వత్సా! భీమసేనుని ప్రతిజ్ఞకు భంగము కలుగును. కాన తొలగుము.

అభి—(తెరవైపుజూచి) ఎవరిది? నన్నిట్లాజ్ఞాపించుచున్నారు యుధిష్ఠిర మహారాజుగారు కాబోలు. మహారాజా! మీా యాజ్ఞచే

దుశ్శాసనుడు బ్రతుకగలిగెను.

దుశ్శా—ఇప్పుడిది పునర్జన్మముగ గణింప వలయును.

అభి—ఇయ్యెడ వీని నంగభంగునిగ నేలనొనర్పరాదు? ప్రాణంబుల మాత్రముంచి తక్కిన సర్వాంగంబుల ఖండించెదను.

దుశ్శా—అయ్యా! అట్లుగాదు. అంగభంగుగ నెన్నడును యుద్ధము సేయరాదు. అందులచే నీతండ్రుల ప్రతినకు భంగము వాటిల్లు కావున నన్ను క్షమించి పోనిమ్ము.

అభి—అగునగు. చక్కని యుక్తిచే ప్రాణంబుల దక్కించు కొంటివి. పొమ్ము.

దుశ్శా—మృత్యువునుండి యిప్పటికి ప్రాణముల దక్కించుకొంటిని. ఇక నైన దడయరాదు.

(నిష్క్రమించును)

సుమిత్రుడు—(ఆతురతతో బ్రవేశించి) ఏమిది! రక్తమిట్లు హస్తము నుండి కారుచున్నను నరకుసేయక నీ కార్యమేది?

(తెరలో)

చ॥ అరదమునుండి నడ్డు నిశితాస్త్రములన్ సహియింపలేక పా
రి రణమునుండి వైరులను లేశము నేనియు సేయలేక నద్ది
ర! రథముండి పారితివి; తేరిక నెక్కుము పాదచారివై
శరముల నేయరాదు; నిజపాయక శక్తిని జూపువేళలన్॥

అభి—ఓహో! భారద్వాజా! ఏమియీ భ్రను! నేనట్లు పాఱిపోవువాడను గాను.

గీ॥ గాయముల నుండి రక్తంబు గాఱుచుండ
గాయముల గట్టగా నల్పకాల మేని
పోఱునలుపక నిలిచితి; భూరిశక్తి
జూపనిదె వచ్చుచున్నాడ; చూడుమింక॥

(తెరలో)

గీ॥ ఓరీ! బాలుడ! యెందుబో నోపుదీవు?॥
బీరముల బెక్కు పలికి గంభీర శస్త్ర
తతుల చిల్లరమూక నదల్చునంత
జన్య వీరుడవై తివే! సాహసమున॥

అభి—ఓరోరీ! కౌరవకులాపసద నీ సోదరునివలె నీకును గర్వభంగంబు కావలయును. గాయమునుండి శోణిత మెక్కుడుగా గాఱుటచే నింతవఱకైన యూఱకొంటిని. కాకున్నచో నిన్నిప్పటికే హత మార్చి యుందును.

దుర్యో—(ప్రవేశించి) ఓరోరీ! డింభకా! యౌవనగర్వాంధ! మహావీరుడవైన నీవు రుధిరము గాఱుటచే యుద్ధమాపనేల? పోరుదము రమ్ము.

అభి—ఓరీ! వెనుకనీయుదు ననుకొంటివా?

గీ॥ ఇప్పుడేగాదె సోదరుం డింతయేని
సిగ్గులేకుండ జేతుల జేర్చి ప్రాణ
ములకు పల్మారు ప్రార్థించె; తులువ! నీవు
సోదరుని పోల్కి గాకుండ జూచికొనుము॥

దుర్యో—ఓరీ! కపటస్వాంతుడా! ఇందులకేగదా! నిన్ను గర్వాలాపి యంటిని. ఇదియుంతయు నరే! మాటలతో నేమిపని? పోటులతో గానిమ్ము.

(తెరలో)

ఓ కౌరవ సేనానాయకులారా! దుర్యోధను డభిమన్యునకు జిక్కినాడు. యాతనిం గాచుకొన రండు.

అభి—ఈ కుంభసంభవుని వాక్యములయందు రాజభక్తి మిక్కుటము గానున్నది. ధర్మజుని బట్టి తెచ్చినపుడింత యాతురత కలుగదే

దు కాబోలు. దుర్యోధనా! నిన్ను నీగురువు దూరమునుండియే మాటలచే గాపాడుచున్నాడు. యిక నీచావు తప్పదు.

(అని శరమును సంధించును)

(తెరలో)

కుత్తా! వీని యూరువులు భగ్నంబొనరింప బావని శపథంబు సేసె. కావున నీవీతనిం బరిమార్పకుము.

అభి—అబ్బా! ఎత్తినశరమెల్ల దింపవలసి వచ్చుచుండెనుగదా! అందరిని నాతండ్రులే పంచికొనినారు. నాకొక్కనింగూడ విడువలేదు.

(తెరలో)

యేమిరా! ధైర్యము! రారాజుపై నీవురా శరము సంధించుట ఇదిగో! నిన్మార్ప కర్ణుడు వచ్చుచున్నాడు.

అభి—ఓహో! కర్ణుడా! రానిమ్ము.

కర్ణుడు—(ప్రవేశించి)

గీ॥ యౌవన మదాంధ! తారతమ్యంబు లేక।
వల సుయోధనుపైన నేయంగదలచి।
నావె? శస్త్రంబులను నింత జ్ఞానమేని।
లేక కర్ణుండు లేడని లీలతలతె?॥

అభి—అంగరాజగు కర్ణుండా యేమి యిట్టి బీరంబుల వదరుచున్నాడు? రారాజునకు నీవత్యంత ప్రియుడవని నేనెఱుంగుదును కావున.

చ॥ కురుకులవంశ సంభవుని గూల్పగ నెక్కిడినట్టి శస్త్రముఙ్।
పరగగ వానిపైనిడను వానిపయిన్గల ప్రేమచేత త్వ।
చ్ఛిరమును బాణవహ్నికయి చెచ్చెరనాహుతి సేసి నీకునుం।
గల యధికంపుప్రేమ యధికంబగునట్టు సేయుమి త్తరిన్॥

(అని శరమును సంధించును)

(తెరలో)

క॥ పరిభవ మందిన ద్రౌపది
బరికించి హసించు కతన పార్థుడు వీనిం
దురమున ద్రుంపగ శపథం
బు రయంబున గొనియె జంపబోకుము వీనిన్॥

కర్ణ—ముక్కుపచ్చలారని వీడు శరమెత్తుటయునే జచ్చుటయునా?

అభి—కర్ణా! మాయుధిష్ఠిరుని వాక్యములచే బ్రతికిబోయితివి. లేకున్న నిప్పటికెక్కడనుందువో?

దుర్యో—(అటుజూచి) భళి! బృహన్నలుడెంతటిమహాయోధుడోగదా! యొక్కకోలచే పాండవాగ్రజుని మూర్ఛనొందించినాడు.

అభి—(ఆతురతతో) ఔరా! బృహన్నలా! నీకండకావరము ధర్మజుడు ధర్మయుద్ధము జేయుచుండ నీవు మధ్యేభంబుచాటున నుండి ధర్మజుని మూర్ఛనొందించితివా? సరియే! యీకోలతో యమ సదనంబున నాతిథ్యంబుగొనుము (యని బాణమునువిడచును.)

దుర్యో—(చూచి) ఓరీ! డింభకా! యెంతపని జేసితివిరా! నీవీ శరముతో జచ్చెదవు కాచికొమ్ము.

(బాణమునుసంధించును)

(తెరలో)

హా! కౌరవనాయక! కర్ణా! రక్షింపుడు! రక్షింపుడు! ఈరాక్షసుం డెవ్వడో మమ్ము హతులంజేయుచున్నాడు.

(దుర్యోధనకర్ణులు నిష్క్రమింతురు)

అభి—ఇతడు నాసోదరుడగు ఘటోత్కచుడుకానోపు (వానిను ద్దేశించి) అన్నయ్యా! మూర్ఛనొందిన పెదతండ్రిగారిని నీవు శిబిరంబు జేర్పుము. నేనీకురుకుల వనమును గాల్చుచుండెదను.

(నిష్క్రమించును.)

## చతుర్థరంగము.

---

ప్రవేశము—సంజయ వైశంపాయనులు.

సంజ—వైశంపాయనా! చూచితివా? యెట్టి ఘోరయుద్ధము జరుగుచున్నదో! ఎంతయాశ్చర్య మెంతయాశ్చర్యము!! యా హైడింబుడు ధర్మరాజు నెంతలో గగనవీధిని దీసికొనిపోయి శిబిరంబు జేర్చినాడు! యంతకును మహాశ్చర్యకరము! యా సౌభద్రుండు ప్రళయకాల రుద్రునింబోలి నిప్పులగురిపించుచు „నిధాకకోర్వ లేము. మొర్రో!” యని శత్రువులు పర్విడునంతదనుక పోరుచునేయున్నాడు చూచుటకేనియు దుస్సహుడుగా నుండెను!

వైశం—ఇదిగో! కర్ణదుశ్శాసన దుర్యోధనులేదియో రహస్యముకు జెప్పుకొనుచున్నారు.

సంజ—రహస్యమున కేమున్నది? ముఖాముఖిబోర లేకేదియో కుట్రను బన్నుచున్నారు.

(తెరలో)

ఓరీ! కౌరవనాయకులారా! మిమ్ముల నేను వెన్నాడకున్నను నా బాణములు మాత్రము మీ ప్రాణముల వదలునవికావు.

వైశం— అహో! కౌరవబల మెంతలో బలుచనబడినదో! (అటు నిటు జూచి) అన్యాయ మన్యాయము!! ఒకరుతు రంగంబులను నొకరు సారధిని ద్రుంచి యధర్మయుద్ధము సేయుచున్నారు. ఛీ! ఛీ!! వీరలంజూడరాదు.

సంజ—చూడకున్న నెట్టులగును? ధృతరాష్ట్రునకే తత్సర్వమును నివేదింపవలయునుగదా!

వైశం భళి! తనకు సహాయము లేకున్నను కరవాలముంబూని దుశ్శాసనను నెంతలో హతునిగా జేసెనో!

సంజ—అదిగో! తండ్రి దుస్థితిజూచి సహింపనేరక నతనికుమారుండగు లక్ష్మణుండు పోరజొచ్చె. ఇరువురు సమముగా బోరుచున్నారు. అయ్యో! లక్ష్మణుడు హతుడయ్యెనే!

వైశం—సంజయా! అదేమి? వారెల్లరు నట్లు మూగినారు అయ్యో! అభిమన్యుని మధ్యనుంచి వీరందరు జుట్టుముాగి వానిని దప్పక హతమార్చెదరు.

సంజ—అయ్యో! వారందరు నట్లు విడిపోవుచున్నారె! (పరికించి) హా! అభిమన్యుడు మృతినొందినాడు ఈవార్త ధృతరాష్ట్రున కెఱింగింపకుండరాదు పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

చతుర్థాంకము సమాప్తము.





ఓమ్.

# పద్యవ్యూహము

-:0:-

## పంచమాంకము.

అర్జుని వెంటాడుచు కృష్ణుడు ప్రవేశము.

కృష్ణ—భావా! రథంబుడిగి పోవుచుంటి వెక్కడకు.

అర్జు—నాకేమియు తోచుటలేదు.

కృష్ణు—(తనలో) అభిమన్యువధచే నీతని మనంబు కలిగినది పుత్ర ప్రేమమించిన వస్తు వేదియు లేదుకదా.

చం. పలుకులు హేమతుల్యములు । పల్కెనజాలునటంచు లేచు
కులుకును వాని విన్నతను ॥ నోరగశీర్షను ముద్దుబెట్టుచున్
పలుకులు నాయనాయని సె । బాసను దుష్టపథంబు బట్టినన్.
యిలనుతుమించు ప్రేమ దమ । దేమి తలంప సుఖావహంబునన్.

దుష్టసుతుండుగల్గినను వాని మరణంబుకై శల్యావశిష్టులగుచుండ రణంబున స్వపితాపశిఖియూ సుతుండు రాజకీయంబున కృష్ణ యశంబు కృష్ణవంతముగ నొనర్చు ప్రతిభాశాలి మారాకా రుడు పితృవ్యరక్షణార్థమై పోయి మరణించెనన్న దుఃఖంబుక ల్గక మానునా.

అర్జు—బావా!

సీ. వర్ణింపగారాని * వైరాగ్యమేలకో
హృదయుశీమనుగాల్చె * వృద్ధజనము

భంగిభీ శాక్త్వత * మోనొకొపుత్రుడు
త్రి సతులంచు తలంచు * రగులుచుండె
శోకవహ్నికనబడు * శూరులప్రాణము
లదనభూమిని * లయురుద్ర
సాయకంబులవేడి * చావనేలగృహము
నందు భార్యలుమీకు * కుందుచుండ్రు

తే. గీ. పొందు ప్రాణంబులుండిన * మొందుగతులు
పొట్ట పోషింపననిపల్కు * బుద్ధిగల్గె
కారణంబేమొ తెలియదు * వీరసహజ
ధీరతలుమాసె దుఃఖంబు * చేకువయ్యె.

కుమారుండని తలంచినంతనే వామనయనస్పందనాది కృత్యంబులు నా భీతికి దోహ్పకుచున్నవి. ఒకవేళ యభిమన్యకుమారునకు హాని రాదుకద.

కృ—(తనలో)

సీ. వదనంబు చంద్రునితో * బాహువుల్ కదళితో
సరివచ్చునాసిక * సహజమార్ద
వంబు గలిగి సురగురు * వంచించు మేధప్రా
శుకుడిందు వెనుకంజ * సూరివరుడు
నగవైరి సరివచ్చు * నానారిపులదున్న
పౌరుషంబున సాటి * పశులఁజేదు
విద్యాధిపతియాట * వేయుశీర్షములుండు
శేషుండు వెర్రియా * చిత్రభాష
లందుతుల్యులు వేరుకా * లరిపుసుతుని
గుణములన్నియు ప్రోగమై * కుటిలధాత

బుద్ధికొంచెము జీవముల్ * పోసెదాట
నేరికి విధాతృలిఖిత * మారజగతి.

అర్జు—బావా! ఆకోలాహలంబులు నాహృదయంబు భేధించుచున్నవి.

సీ. సతత సత్యవ్రత * సంచార ధర్మజ
హాసిగల్గదుకదా * యాహవమున
భండనమండిత * చండగదాఘాత
మర్దితరిపుభీమ * మహితసింహ
మేవ్యాధబుద్ధి స * మీపించెనో హాని
మాద్రీసు తానువుల్ * మాసెనొక్కొ
మారతుల్యశరీర * ఘోరసంగ్రామ భీ
మ కుమార జీవ సం * హరణ బద్ధ
కంకణుల కృత్యంబులు * గల్గెనొక్కొ
క్రొంపనీమాన హరిసైక * తత్పరుల మ
నంబు పొంగెనో తెల్పు మా * నంద తనయ
యిట్టి దశగల్గ నటునిటు * గొట్టుగొంటి.

కృష్ణు—నేనేమి దేవుడనాయేమి నాకేమియు తెలియదు. అందరకు క్షేమమనియేనాభావము పోవుదము రమ్ము.

అర్జు—బావా నీవైకరి గాంచిన నేదియో కీడుమూడెనని తోచు చున్నది.

సీ. ధర్మరక్షణచిత్త * ధర్మజక్షేమంబు
గల్గెనో లేదో నీ * కగును నుడువ
భీమగజేంద్రంబు * వీరమాన్యయశంబు
తో మెల్గెనోలేదో * తోయజాక్షి
వీరమాతయఖిల * శూరకాంతామణి
మానూత సుభద్రయాచు * మనును కాదె

కౌరవకృతపాప ౯ కష్టచిత్త సుభద్ర
సుఖముగాంచు తనరదా ౯ సురనునేత.
తే॥గీ॥ఆత్మజుని మాటపల్కుమా యగునెసుఖము
వానిసేవంబునదుగగ వంచెదేల
మోముచిరునవ్వుతోపదు సేమచుగునూ
గాయమేరీతినుండెనో కరుణనుడువు॥

కృష్ణు—అభిమన్యుడు నీసోదరులందరుక్షేమము. తృప్తిపొందితివా!

అర్జు—నీమోమున విషాదము కన్పడుచున్నది. దానిగప్పిపుచ్చ బహు ప్రయాసముల బొందుచుంటివని తోచుచున్నది. కారణమేమియో నాకు నుడువుము.

కృష్ణు—ఏమియులేదు (తనలో) నీనిసత్వరంబె గృహంబునకు గొనిపోకున్న మరణివార్త నీని కర్ణంబులబడ నాతరముగాదు. (ప్రకా) బావా రమ్ముపోదుము. సోదరసత్కారవేళ మించుచున్నది. ఈపాటికే మీయగ్రజుండు సీకై నిగ్గోలోనరించును.

అర్జు—సరియే పోవుదము (నిష్క్రమింతురు)

కృష్ణార్జునులు ప్రవేశము.

అర్జు—బావా!

సీ॥యభిమన్యు విక్రమ * మభివర్ణనముజేయు
వందిమాగధులేరి ౯ యిందువదన
వేరినీరాజన ౯ మువ్వశాత్రవకంఠ
రక్తద్రవసనవి ౯ రాజితాంగ
భూపపుత్రకులకు ౯ చాపకనచఖడ్గ
ములుతీయగారేమి ౯ పూర్వమట్లు
జయపతాకాదులు ౯ జాడలుగానవు
యభిమన్యుడెదురుగా ౯ యరుగడేమొ

తే. గీ. యుత్సవాదులుమానిరి యోధులెల్ల
మద్యపాన కోలాహల మాపివేసి
దుఃఖపూరితచిత్తులై దూరమందె
నిలిచియుండిరి దేలరో నీరజాక్షి.

కృష్ణ—అర్జునా!

సీ. జంబుకరోదన జాతశంకకుతోడు
నయనస్పదురుటలు భయదమేఘ
గర్జనంబులకాల కందవర్షంబులు
దుర్గంధయుతవాయు మార్గములును
జీవరహితయోధ సీమలనవ్వులు
కాకికూతలు కర్ణ కంటకములు
ఖేచరభాష్పంబు పీచి వ్రాయన
గాలితుపానులు గల్గుచుండె

తే. గీ. కారణంబేమొ తెలియదు కర్ణవైరి
ద్వారవతి లోక వదనముల్ వ్రాలియుండి
దుఃఖమునుచూపుచుండెను తోలుతనుండి
యశుభతోరణమగుపడె హాయిదేమి.

కాన సత్వరంబుగ గుడారమున కేగి ధర్మజుగాంచెదము. దాన సర్వంబు విదితంబగు.

(భీమ ధర్మరాజాదులు ప్రవేశము.)

ధర్మ—నాయనా! ఆసమయంబున ద్రోణపుత్రోత్సాహులై యభిమన్యు నల్దిక్కుల ముట్టడించిరి.

భీమ—

వం. వ్యూహముచింప గొంచెము మ । హోద్ధతి వైరులద్రుంతునాగదా
బాహుబలంబులన్ నలిపి । భస్మము జేసెద నంచు పల్కనా

వ్యూహము చింతునం చరిగి । పూర్వకృతాఘఫలంబు సైంధవ
ద్రోహముగామనంగ నతి । తుచ్ఛులచే మృతినొందె సోదరా.

ధర్మ.- భీమా! అభిమన్యుకుమార మరణంబునకు కారణంబీ ధర్మజుడు కాని నీవుకాదు.

చం. పలువురు బాహువిక్రములు । పార్థులు శాసితవైరి సైనికుల్
కలరు మదీయసోదరులు । కౌరవయోధులు ద్రోణముఖ్యలీ
రులు ననుబట్టి నెంచినను । ప్రాటగునొక్కయటంచు గర్వినై
మెలిగితిదాని పాపఫల । మెవ్వని మూలమునాకె చూనుగా.

మఱియు.

సీ. ద్రోణప్రతిజ్ఞని ♦ రోధింప బాలకు
పంపి చంపించితి ♦ ఫల్గునుండ
యనిపల్క కోపించి ♦ యాహవంబునశూర
మస్తకంబుల ద్రుంచి ♦ మరచుదాన
స్వక్షేమమందున ♦ నమసినపాండవ
నిర్మూలమగు పాండు ♦ నృపతిసుతుల
నందు నొక్కడు మర ♦ ణంబు నొంద మిగత
వారు దేహంబుల ♦ బాయప్రతిన

తే. గీ. బూన నక్కటా రత్నంబు ♦ బూడెగలిపి
నాడనే చావభూమికి ♦ నష్టమేమి
యేక పుత్ర కిరీటి త ♦ దేకపుత్ర
హరననిరతాగ్ని శోకంబు ♦ జనును మదిని.

అదుగో కృష్ణసహితార్జునుండు వచ్చుచున్నాడు వాని నేరీతి శాంతింపు
మందును.

అర్జు — సోదరా నమస్కారము. ఏల మీకు నవనదుఃఖంబు కల్గినది.

దు॥ ఖలుఁడైనమదీయసోదరునిసుక్ । గర్వాంధుఁడై దూరెనో
ములుకల్ మేనుసగ్రుచ్చికర్ణపథమున్ । బోవంగనూహించెనో
విలసద్దివ్యశరుండుక్రీడికలఁడా । పేర్వెన్నమాత్రానసే
ఖలుఁడై నన్నినుకేదుఃరగోరునో కొయ । ద్యుజేరుపక్షీంద్రుఁడై ।

అటులజరిగిన మంచిదైయుండును.

అర్జు—సోదరా, క్రీడియింకను మరణింపలేదుకదా. యేదియోమనంబునఖేదంబుగల్గ మూకుండవై చింతిలనేల.

సీ॥ పరశురాముని చెంత ॥ వరవిద్య నేర్చుట
ద్రోణుఁడుగర్వుఁడై ॥ దూరెనొక్కొ
చిరజీవియనుగర్వ ॥ చేతుండుద్రౌణినిన్
బాణాసనంబుల ॥ బాధనిడెనొ
చిననాడుద్రోహముల్ ॥ చేసినమూకులై
సిల్చుపాండుసుతులు ॥ నేర్పు రొక్కొ
యపకారమొనరింప ॥ నంచుతలంచినిన్
దుశ్శాసనుండుతా ॥ దూరెనొక్కొ

ధర్మ—

తే. గీ. వారలెవ్వరుకారు నన్ ♦ బాధబెట్ట
కారణంబేను జెప్పంగ ♦ గిలనెయనుజ
ఖడ్గధారలచంపుము ♦ కాలుపురికి
జేరుదును దుఃఖమాపగ ♦ జేవలేదు.

అర్జు—అగ్రజా నీకేలయీదుఃఖము. కారణంబెరిగింపుము.

ధర్మ—సైంధవుండే.

అర్జు—సైంధవా! మూఢా!

ఉ. శాంతిధనుండు సోదరుడు । సద్గుణపుంజము సర్వలోకవి
ఖ్యాతుండు ధర్మమూర్తి పరు । శాంతిని గెల్చెడివాడు యుద్ధమున్

చింతులునట్టివాని నిడ । జేయుడె ధౌర్త్యము క్రీడిగల్గడే
చింతలుగల్గు ధర్మజుని । జేరుడ ద్రోహముజేయ కోరికన్.

అన్నయా! ఆమరాత్ముండుచేసిన ద్రోహమేమి! అభిమన్యకుమారుడు
గానరాడేమి!

ధర్మ—

చం. ఖలుడు యుధిష్ఠిరుండు తన । కాయముగావగ ద్రోణభీతిచే
చలమునుబూని పద్మముఖ । సంహరణార్థము బంపె శాత్రవుల్
పలువురు చుట్టుముట్టియము । వాకిటి బంపిరి చాప ఖండనం
బలమగ శూన్యసారధిని । బాలకు భ్రష్టశరాసనాధ్యునిన్.

అర్జు—ఓ కౌరవసేనాపతులారా!

ఉ. బాలకు జంపుటల్ ఘనమె । వంచనజేసి శరాసనంబులన్
లీలగద్రుంచి సారధిని । వ్రేటునజంపి కిరీటి జాము వ్రా
మూలవిహీనవృక్షముల । భూమిని కౌరవసేనజేయు విూ
కాలము జేరువోట నిటు । గల్గెకుబుద్ధులు పాకహారోనుముల్.

కృష్ణా తక్షణంబె రధంచాయ త్తంబొనర్పుము. భీమా! నకులసహదేవు
లారా!

చం. రణమొనరింపబాలకు వి । రాజిత శస్త్రధురంధరాదిభీ
మనకుల వర్గముండబను । పం దగునే సురరాక్షసాదిమా
రణకుశలాగ్రబాణతతి । వ్రమ్గరమాపతిక్రీడిగల్గుచో
బనుపుదురే స్వజీవతతి । బాయకముందు కుమారు వాజికిన్.

పోనిమ్ము బంపినను మొగ్గరంబు చించినవెనుక వానికి మీరు సాయ
మొనర్చితిరా!

భీమ—గదకేలదాల్చి వానికి సాయమొనర్చుటకు సోదరయుతుండనై
పోవునంత సైంధవుండు శంభువరప్రసాది మమ్ముల నడ్డగించె.
వానిచే వారింపబడి పోరుచుండ— (కన్నులనీరునించును.)

# పంచమాంకము.

అర్జు—

క. సోదరమానుషేదము వి । శుద్ధచరిత్రుకుమారుచంపినన్
షేదః మగ్నుజేయుఖలు । షేగుడు కుర్రంగకముయిన్ను చంపి మీ
పాదములందు నిల్పెద కు । భారముపోవ మురారితోడునా
వాదమునిల్ప లేనియెడ । వహ్నినిజొచ్చెద గాండివంబుతో.

కృష్ణు—అర్జునా నీప్రతినయేదియో నీకెఱుంకయా! భాను డస్తాద్రి కేగువరకు ద్రోణాదులు వాని గావలేరా!

అర్జు—బావా నేటిరాత్రి శంకరు స్మరించెద. దానలాభంబుగల్గును.

కష్ణు—పయిన భగవంతుడున్నాడు.

(అని నిష్క్రమించును)





ఓమ్.

# పద్మవ్యూహము.



## షష్ఠాంకము.

### ప్రథమరంగము.

సైంధవుఁడు ప్రవేశము.

సైంధ—అయ్యో నేను క్రీడిసుతునిఁ బరిమార్చి నందుల కాతిబాణాగ్ని నుండి నన్ను రక్షించువారెవ్వరునుఁ గానరారు. సమస్తలోకములు నాతడన్న వడంకును అట్టి మహానుభావునికిఁ గీడొనర్చిన వానిని నన్నురక్షించువారెవ్వరు? రేపు సూర్యాస్తమయము గాకమునుపె నన్ను బరిమార్చెదనని ప్రతినయొనర్చె హా దైవమా!

గీ. రేపు భానుండు గ్రుంకక లీలజెలగు
నప్పటికె నన్ను దృంతునన్ ప్రతినజేసె
గ్రీడి! యయ్యది దప్పింప నేడు శక్తు
డొక్కఁడో? మృతిబారి నేనిక జిక్కవలెనె?

మ. నన్నురక్షింప సమర్థుఁడొక్కరుడు గానన్ రాడు; తత్తీవ్ర బా
ణనికాయంబుల వాతఁజొచ్చి మడియ గోఫాలమున్ వ్రాసె ధా
త; నరుల్ శాంతుని జేసి నా కీసువులన్ దానంబు నెవ్వాడు సే
యునో యాతండె గురుండు దైవమును నాకు న్నాతఁడే సర్వమున్.

చ్చటికిపోయి తల దాచుకొందమన్న నాతన కాపులే కన్పడుచున్నారు.

సీ. అనలంబునంబడి చనగనెంచిన యెడ
ఖాండవంబున దృప్తుగా నొనర్చె
పాతాళలోకాన బ్రతుకనిచ్చుజనింప
శేషునకల్లుడై చెలగె నతఁడు
అమర బృందైక సేవా మానసుడ నైన
దత్పతి సూతియై తనరె నతఁడు
కువలయ భూధర కోటియన్నచో నెల్ల
వారి పై గాంచె కవ్వడియె జయము

గీ. ఈ చతుర్దశ భువనంబు లెందు జే
సన్నుగాపాడ గల్గిన నాధుడొకడు
గానరాడింక నేనెట్లు గోచరింతు?
ఎందు బోయెదనిక తల నెందుదాతు?

కన్నును మిన్నునుగా కప్పుకట్టి యొనర్పరాని కార్యమొనర్చితిని. ఇప్పుడు దాని ఫలమును గుడుచుచుంటిని.

దుర్యో.—(ప్రవేశించి) బావా! యిట్లు విచారించుచున్నావదేల?

సైంధ—నాయవస్థ నీకేమికయ్యా? ఎవనిప్రాణము వానికితీపి. నీప్రాణము నీకున్నట్లు నాప్రాణము నీకుండునా? ఎద్దుపుండు కాకికేమన్నట్లు ప్రాణసంకటావస్థయందు నేనుపడి తన్నుకొనుచుండ నన్ను హేళనచేయవచ్చితివా?

దుర్యో—బావా! నేను చెప్పునది వేళాకోళముకాదు. నేను నిశ్చయముగా చెప్పుచున్నాను.

సైంధ—ఏమని? క్రీడినన్నుఁ జంపుననియా?

దుర్యో—ఏమి నీపిచ్చ! మేమందరము నిన్ను సంరక్షణముచేయుచుండగా నీప్రాణములకు హానికల్గుటయా

ఉ॥ క్రీడియెగాదు గ్రీడియుని । కిందేగియించిరినున్ వధింపగా
వాడిగవచ్చు వక్షమున బాణ । సుయోధను డూరకుండునే?
ఈసుకదా సుయోధనుడా । కింతయు వీలతడా జూనినున్
కీడొనరించి పట్టతనికిన్ భయ । మందెదవేల యింతగా॥

ఇంతయేల? నీప్రాణమునకు నాప్రాణము నడ్డువైచెదను. నీవు వగపుందక యుండుము. ద్రోణుడు, కర్ణుడు, కృపుడు మొదలగు మహావీరులందరు నిన్ను బరిరక్షించుటయే ముఖ్యకర్తవ్యముగా జేసికొని జేసినుడస్తమించుదనుక గాపాడెదమురమ్ము.

(ఇర్వురు నిష్క్రమింతురు.)

## షష్ఠాంకము.

### ద్వితీయరంగము.

---

ప్రవేశము—కృష్ణార్జునులు.

అర్జు—బావా! అవేచూడుము.

శా॥ చక్రవ్యూహమునందు వక్త్రమున నాచార్యుండు నిర్వంకని
ర్వక్రప్రౌఢిమ సద్యశంబుగొని శౌర్యస్ఫూర్తి దీపింపభూ
చక్రం బాక్కట గంపమొందగనపు త్వ్యూహంబుతో నార్చుయీ
వక్రస్వాంతుల గూలనేసెడు నిర్వక్ర ప్రభాదీప్తిచే॥

కృష్ణ—పార్థా! యీవ్యూహమునందు ద్రోణుడు కన్పడుటలేదేమి?

అర్జు—అభిమన్యునకు బాండవ పక్షపాతముచే దారిసొనంగెనను తలంపుజనింప నాతనిదొలగించి కర్ణునిముఖ్యునిగా నొనర్చిరి.

కృష్ణ—ఇదిమనకు మహోపకారమే.

అర్జు—ఎటు?

కృష్ణ—నీశంక యింక తీరిపోయినది.

ఉ॥ శరసంధానవిధానమందెలుపు నన్మన్నీవరు ద్రోణాఖ్యునే
తెరగుల్ జంపుదునన్న శంకజనియెన్; దీవ్రాసిధారాహతి
స్ఫురణం బొప్పగవైరి వర్గముల నిర్మూలంబు గావింపన
వ్వరునా కోరణ మాచరింపగల రిప్పట్లన్ మురారీ! స్వభూ
యని నీవిప్పుడు చెలరేగవచ్చును.

అర్జు—

గీ॥ గగనమందున నక్షత్ర గణముపగిది
వైరివరు లెల్లరును గానవచ్చుచుండ్రి
కాని సైంధవు డెందును గానబడడు
పెండ్లి కొమరుండు లేనట్టి పెండ్లి పగిది.

భీముడు—(ఆతురతతో ప్రవేశించి) తమ్ముడా సైంధవుడెందున్నాడో యెరుంగుదువా? వ్యూహమునం దెచ్చటనుం గానరాకున్నాడే!

అర్జు—ఆవిషయముచే నెఱుంగను.

భీముడు—

ఉ॥ వ్యూహము నంగునుంచి న। మహోగ్రగళరాగ్ని సమాఢ్యుడై ననీ
చేహతుడౌను గాయనుచు। చెచ్చెరవానిని పుష్కకంబునం
దీహజనింప జంద్రపదవి న్ని। లుపంగ గృతార్థుడై రినీ
వీహరి సత్కృపం గొనుచు। వేగమువానిని నూటడంచుమా॥

అర్జు—(దృష్టి పైకినిగిడ్చి) ఏడీ! నాకెందునుం గనంబడుట లేదే!

కృష్ణు—వ్యూహమును జించుకొని లోనికిం బ్రవేశించినప్పుడుకదా నీకు గన్పడుట.

అర్జు—సరియే రథమును సాగనిమ్ము.

భీము—బావా! యింతదట్టముగ నలముకొన్న వీరినమూహమునుండి నీవు రథము నెట్లుతోలగలవు? అందులకె నొక యుపాయమును జెప్పెదవినము.

ఉ॥ ముందుగ మద్గదాహతిచే ॥ మూక ననేకుల మ్రందజేయగా
స్యందనమాశుయానమున సాగగనిమ్మరి మధ్యనుండి సం
క్రందన సూతిపిల్లలర కౌరవనాథుల నొక్క వ్రేటునన్
మ్రందగజేయు నాపయిన మానుషరీతిని వాని గూల్పవే.

కృష్ణు — ఔను! నీవు చెప్పినది బాగుగనున్నది నీవుపోయియట్లొనర్పుము.

భీము — అటులనే యొనర్చెదను భవత్ప్రసాదము.

(తెరలో కలకలము.)

కృష్ణు — భీభత్సా! యటుజూడుము.

సీ. చాపము క్త్రేషుని సారతనుంగాంచి
కర్ణుండు నొకవంక కలతఁజెంద
నిజగదాహతి నితద్భుజ బలమింత త
గ్గమి సుయోధనుఁడెంతో కలతఁజెంద
విప్రాస్త్రచయము ప్రవీణతఁ జూపమి
గురుపుత్రుఁడెంతయు గుందుచుండ
తన దోర్బలంబదెంతయు వ్యర్థమగుటచే
కృపునకు నెమ్మది ద్రపజనింప

గీ. తక్కుగల భీకరారాతి తతినడంకి
చేష్టలేకుండ నిలచి యచ్చెరువునొంద
నరిగణంబులజించి చెండాపజొచ్చె
భీముఁడల్లదె నిజగదో భీముఁడగుచు.

ఉ. తనగదఁద్రిప్పుకొంచు నిజదర్పమెలర్ప సుయోధనాది స
ద్విసుత మహామహాళిని ప్రవీణత వెల్లతి శ్లాఘ్యమాగతిన్
జనితరుషాతిరేక తనసంగతులం బొనరించి మించి దా
రిని మన్నికై యొనర్చెగద లీలగఁబోవగ బోరగావడిన్.

(నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

ప్రవేశము—సంజయవైశంపాయనులు.

సంజ—అయ్యో! యేమిది? ఆశ్చర్యము! వృకోదరునిచేతనే కర్ణుడు పడినాడే అర్జునుని ప్రతిన చెల్లునో చెల్లదో యను శంక పొడము చున్నది.

వైశం—పాండవులకు జయముకల్గుననుట నిశ్చయము వారు దైవ బలముకలవారు ధర్మము వారిపక్షము కావున జయమబ్బెనన్న సందేహమేమి.

సంజ—అదిగో కర్ణుడు వేచునంతనే వానినుద్దేశించి శ్వేతవాహనుం డేదియో పలుకుచున్నాడు.

(తెరలో)

గీ. సూతపుత్రక ! భీము విస్ఫూర్తి చేత
జచ్చితివటంచు దలచినా చేసినట్టి
ప్రతిన చెల్లునో చెల్లదో లాఘవమున
యనుచు జింతించితిని; మేలయ్యె నిప్పుడు॥

ఓరోరీ సూతకులసంభవా! వృకోదర గదాహతిచే బడిచచ్చితివని తలచితిని అందులకయి వగచుచుంటిని కాని యిప్పుడు మిగుల సంతసించుచుంటిని.

వైశం—ఇదిరాధేయునకు గ్రీడియొసంగిన ప్రత్యుత్తర వచనంబులు పలుకులతోడనే ములుకులుకూడ పోవుచున్నవి.

సంజ—కర్ణుడసమానుడు వాటినన్నిటి మధ్యమార్గమునందే గూలనేయుచున్నాడు.

వైశం—(భయముతో)అయ్యో! అయ్యో! పార్థుడాగ్నేయాస్త్రమును విడచినాడే? గగనమార్గంబంతయు ననలంబు గ్రమ్ముకొనియె.

సంజ—కర్ణుడుమాత్రము సామాన్యుడా! వారుణాస్త్రమును విడిచియు న్నాడు. పార్థుని యాగ్నేయాస్త్రము నిష్ప్రయోజనముగదా!

వైశ—అదిగో కిరీటినాగాస్త్రమును విడచుచున్నాడు. దీనిచే రాధే యుండు తప్పక హతుండగును.

సంజ—అట్లెన్నటికిని గాడు. కర్ణుడు గరుడాస్త్రమును విడచుచున్నాడు దానికదియే ప్రతిహతము.

వైశం—ఇదియంతయు నేమిలేకానిగంగ వెట్టులెత్తి స్వపక్ష పరపక్ష వివక్షత లేక సంక్రిందననూతి యరదంబునకుమార్గమొసఁర్చు భీ ముడు ద్రష్టవ్యుండుఁ

సంజ—ద్రష్టవ్యుల కేమిలెమ్ము కాని కృష్ణార్జును లిటకరుదెంచుచు న్నారు. మనమిటనుండరాదు. పోవుదమురమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

చతుర్థరంగము.

ప్రవేశము—కృష్ణార్జునులు.

అర్జు—బావా! కాలము చాలవరకాసన్నమైనది. సూర్యాస్తమయీ కాలము కావచ్చినది. ఇక నాప్రతినజెల్లించు భారము నీయదే.

కృష్ణు—అర్జునా! ఇందులకొక్క కర్తవ్యము కన్పట్టుచున్నది. సప్తసేనానాయకులు నేదియెట్లున సైంధవుని గాపాడుటే ముఖ్యకర్తవ్యముగా జేసికొని ప్రాణములపై నాసవీడి హాహారాహారి పోరాడుచున్నారు. కావుననీవు ఛాయయందు కొంత విశ్రమింపుము. అటుపైన నేజెప్పునట్లొనర్పుము.

(తెరలో)

మ॥కురసేనా నివహంబుఁ జంపితని నీకుణ్ గర్వమానొక్క పా ర్థ! రణోత్సాహముఁ బూనివచ్చె ధృతరాష్ట్రపోద్భవుండి య్యెడణ్

కరమర్దితా భవదీయ దోర్బలము, వీకన్, జూపగా జెల్లు ''న
ద్దిర శాబాష'' ని మెచ్చుకై వడిని సాంద్రీభూతదోశ్శక్తియై॥

అర్జు—ఎవ్వరు లీగర్వాలాపంబులు?

కృష్ణు—ఇంకెవ్వఁడున్నాఁడు? మనసుర్యోధనునివే. గురునొద్ద నూతనము
గ కవచమును దెచ్చుకొన్నందులకు బలముకూడ హెచ్చినదను
కొనుచున్నాడు కాబోలు!

దుర్యో—(ప్రవేశించి) నీకును నేఁడెంత మందబుద్ధి కల్గినది!

కృష్ణు—మందబుద్ధి కేమున్నది? నీవుక వేదబ్రాహ్మణుని యాచించి
కవచమును దెచ్చుకొన్నందులకు నే నాశ్చర్య పడుచున్నాను.

దుర్యో—అట్లైన నీకవచముతో నాకుఁ బనిలేదు. రథమును దోలు
కొనిరమ్ము. (అందరు నిష్క్రమింతురు)

---

షష్ఠాంకము.

పంచమరంగము.

---

ప్రవేశము—ధర్మజుడు.

ధర్మ—

ఉ॥ సాయమికా దొడంగినది సైంధవు డింకను జిక్కలేదు పా
ర్థా! యెటు నీప్రతిజ్ఞచె కృతార్థుడవయ్యెదవో యెరుంగ నా
హా యెటులున్న దెట్లులగు; నబ్బదళాత్ముని సాయముండియుఁ
జేయఁగరాని కార్యమిటు చేకురెనిప్పటి కేమిచిత్రమో॥

అయ్యో! ఇప్పటికే సాయంకాలము కాదొడంగినది సైంధవుడింకనుఁ
గనఁబడలేదు ఇక నాక్రీడితన ప్రతిననెట్లు తీర్చుకొనునో? అత
డా ప్రతిజ్ఞదీర్చుకొనని పక్షమున నసువులబాయుట నిశ్చయము.
ఆప్లై నీసోదర చతుష్టయుం బదెట్లుబ్రతుకగలదు? అయ్యయ్యో!

కౌరవసేనలయ్యోవేదినాంతమయ్యో నని యుప్పొంగుచు యానంద భరితులై మహార్భాటంబులఁ జేయుచున్నారు ఇక నేమిగతి? హేదీనబందూ! కృష్ణా! మమ్మనేకాపత్తులనుండి తొలగించి చిగురున కీవిపత్తుచే మడియజేయుదువా? నీసీడనైయె మెలఁగు యర్జునుని నేటితో సమాప్తిగా నొనర్చెదవా మహాగాధముల నెల్ల దాటించి యీపిల్లకాలువతో మరణింపజేయుదువా? హే ఆపద్బాంధవా! నీవే శరణు (ఇటునటుఁజూచి) భళిభళి! సైంధవుడు కూలినాడు. ఇక మనకు దిగ్విజయమే.

(తెరలో)

ఓకిరీటీ నీ వొనర్చినది యధర్మము దినాంతమైన పిదప సైంధవునిఁజంపరాదు. ఇంతకుమున్నె సూర్యుడస్తమించుట నీవెరింగియు నా తనిశిరము నూడగొట్టితివి. దీనికిఁ బ్రాయశ్చిత్తముగ నీవగ్ని యందుబడి చావవలయును.

ధర్మ—అయ్యో?

చం॥సదసున గట్టుబట్టలును సర్వము నోర్చిన యప్డు నాయమున్
పదపడిచెప్ప నొక్కడును బాల్పడ; డిప్పుడ యేమువైరులై
న, దగవచింతు డెంతయును నాయము నప్పునిజొచ్చి క్రీడిచా
వదగునటంచు; నింతియుగ వైరులు ధర్మముజెప్ప బాల్పడన్॥

(మబ్బుల పరికించి) ఏమి నాయదృష్టము. సూర్యుడింక నస్తమించలేదు. ఇదియంతయు నా కృష్ణభగవానునిమాయ. అదిగో వారియ్యెడకే వచ్చుచున్నారు. వారినిఁబోయి కలిసుకొనెదను. (నిష్క్ర)

పంచమరంగము.

ప్రవేశము—కృష్ణార్జునధర్మజులు.

అర్జు—(శిరములసంధించి మింటఁగొట్టుచు) ఎంతదనుక నీశిరంబు శరంబులనిట్లు గగనమార్గంబున నిలుపవలయును?

కృష్ణు—ఇందొక్క రహస్యంబుగలదు. ఈతని జనకుండీతనికొక్క వరం బొసంగె. ఈ యుత్తమాంగంబెవ్వరి హస్తమందుబడి భూమిపైఁ బడునో వానిశీర్షము వేయిచెక్కలుగ భిన్నంబగును. కావున నీవీశిరంబును వీనిజనకుండును తపోనిష్ఠాగరిష్ఠుండునగు వానిహస్తంబునందు బడునట్లు కొట్టుము. అంత నాతఁడు దానిన సహ్యాభావముతో నేలం బడవైచును. తచ్ఛాపాను క్రమముగా నాతని శీర్షము వేయి వ్రక్కలగును అట్లుగాక నీశరమున్న వలననే యీశిరము భూమిపై బడినయెడల తవమూర్ధమయట్టులగును. కావున నావచించినట్లొనర్పుము.

అర్జు—సరియే. అట్లేయొనర్చెదను. (అని శరములనుసంధించివిడచును.)

(తెరలో)

ఛీ! ఛీ! హేయము! హేయము! ఏమి యిది కృత్యము. (పెద్దధ్వని.)

కృష్ణు—క్రీడీ! నీవెంతకైన సమర్థుడవు. నీశరంబున శిరంబాతని హస్తములంబడి యాతనిశిరస్సు వ్రక్కలైనది. వింటివా!

అర్జు—ఆశ్చర్యమగునే నా!

కృష్ణు—అగును. అదిగో ధర్మజుఁడు నిట్లేవచ్చుచున్నాడు. మనమెల్లరము స్వస్తివాక్యముల కరతాళధ్వనులతో పాడుదము.

కృష్ణుడు, అర్జున, ధర్మజులు—

శ్లో॥ “స్వస్తి ప్రజాభ్యః; పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః;
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం;
లోకాస్సమస్తాః సుఖినోభవన్తు”॥
ఇతిసర్వే నిష్క్రాన్తాః

సంపూర్ణోఽయంగ్రంథః

---

47వ పేజీ మొదలుకొని శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

